# మొఘలుల నగ్న స్వరూపం

అంతఃపురాలు, హత్యలు, వాటి వెనుక దాగి ఉన్న చీకటి గాథలు




వశి శర్మ

తెలుగు అనువాదం: బాళ్యూరి జయ చంద్ర

# మొఘలుల నగ్నస్వరూపం

**అంతఃపురాలు, హత్యలు, వాటి వెనుక దాగి ఉన్న చీకటి గాథలు**



వివరాలకొరకు సంప్రదించండి:

books@agniveer.com

తొలి ముద్రణ

జనవరి 2019

# మొఘలుల నగ్నస్వరూపం

అంతఃపురాలు, హత్యలు, వాటి వెనుక దాగి ఉన్న చీకటి గాథలు

రచన

**వశి శర్మ**

తెలుగు అనువాదం:

**తాళ్ళూరి జయ చంద్ర**

# **వశి శర్మ గారి ఇతర రచనలు**

**ప్రతి ముస్లిం ఉగ్రవాది కాడు**

తరువాతి ఉగ్రదాడిని ఎలా నిరోధించాలి

**భారతీయ ముస్లింలు**

భరత మాత బిడ్డలా, అరబ్బుల బానిసలా?

అగ్ని సంకల్పం

వినూత్న మార్గదర్శి, స్వాతంత్ర్య సమర పితామహుడు, ఇస్లామిక్ ఉగ్ర-వాదంపై పోరాటానికి ఆద్యుడు అయిన మహారాణ ప్రతాప్ కి ఈ పుస్తకం అంకితం. అలాగే, అగ్నివీర్ వెనకుండి నడిపించే శక్తి, నాకెంతో స్ఫూర్తిని-చ్చిన వారైన శ్రీ సంజీవ్ నేవర్ గారికి అంకితం.

# ముందు మాట

మన భారతదేశ చరిత్ర సమున్నతమైనది, స్ఫూర్తిదాయకమైనది. ఈనాడు అటువంటి ఘన చరిత్రను మూడు జాఢ్యాలుపట్టి పీడిస్తు-న్నాయి. అవి అనుచిత లౌకికవాదం, కీర్తికాముకులైన జాతిద్రోహులు, ఆధునిక విద్యావ్యవస్థ. చాప క్రింద నీరులా ఇవి భారతీయుల మనసుల్లో వక్రీకరించిన చరిత్రను నింపడమే కాకుండా మన చరిత్రపై మనకు దుర-భిప్రాయాలు కలిగేలా చేస్తున్నాయి. ఇవి దేశ ద్రోహులను, శత్రువులను గొప్పవారిగా చిత్రించాయి, ఆదర్శనీయులను కించపరిచాయి, మేధో ఉగ్ర-వాదాన్ని పెంచిపోషించాయి.

లౌకికవాదం సైద్ధాంతికంగా గొప్పదేకాని దానివల్ల అనుకోని ఆపదలెన్నో ఉన్నాయి. దీనిని ఆచరణలో పెట్టినప్పుడు, అందులోను తరతరాలుగా బానిస మనస్తత్వం అలవడిన మన భరత జాతిపై ప్రయోగించినప్పుడు కొన్ని 'పౌరాణిక' అపోహలు ఏర్పడుతాయి. 'పౌరాణిక' అని ఎందుకంటా-నంటే దుర్మార్గులైన వారు భయస్థులపై లౌకికవాదం బలవంతంగా రుద్ది-నప్పుడు చరిత్ర పురాణమవుతుంది, పురాణం చరిత్రవుతుంది.

దీనివల్ల, తరతరాలుగా మనకు స్ఫూర్తిప్రదాతలుగా ఉన్న రాముడు, కృష్ణుడు వంటివారు పురాణపురుషులయ్యారు, మహమ్మద్ బిన్ ఖాసిం, ఖిల్జీ, లోధి, బాబర్, అక్బర్, జహంగీర్, షాజహాన్, ఔరంగజేబు, బాబర్షా జఫర్ వంటి దుర్మార్గులు, ఉగ్రవాదులు చారిత్రక వీరులుగా చిత్రింపబడ్డా-రు.

అల్పసంఖ్యాక వర్గాలను (ముఖ్యంగా ముస్లింలు) బుజ్జగించి, వారి ఓట్లకోసం కక్కుర్తిపడి, లౌకికవాదాన్ని మన చరిత్రకి కూడ ఆపాదించి-నప్పుడు ఇలాంటి అనర్థాలే జరుగుతాయి. అల్పసంఖ్యాక వర్గం వారు దుందుడుకు మనస్తత్వం కలిగివుంటే వారి పూర్వీకులు అత్యంత సా-ధుస్వభావులై ఉండిఉంటారని, మిగతావారు ఎంత సాధు స్వభావం, వినయ విధేయతలు కలిగివున్నప్పటికీ, వారి పూర్వీకులు ఎంతో గొప్ప-వారైనప్పటికీ అసలు వారి ఉనికే లేనట్టు ఊహింపజేస్తుంది ఈ లౌకికవాద ధోరణి.

శౌర్యప్రతాపాలు, త్యాగాలు, ఆత్మగౌరవంతో నిండిన మన చరిత్రకి అనుచిత లౌకికవాదంతోపాటు మరో ప్రమాదం కూడ పొంచి ఉంది. అది

ధన, అధికార, కీర్తి దాహాలతో నిండిన మనస్తత్వం కలిగినటువంటి నటీ-నటులు, దర్శకనిర్మాతలు, రచయితలు, గాయనీగాయకులు, రాజకీయ నాయకులు, చరిత్రకారులు, మేధావులు. అక్బర్, జహంగీర్, షాజహాన్, అలెగ్జాండర్, టిప్పు సుల్తాన్ వంటి ముష్కరులను గొప్పవారిగా, ఉదాత్త స్వభావులుగా చిత్రించడానికి వేల కోట్ల రూపాయలు సమకూర్చి ఖర్చు చేస్తుంటారు వీరంతా.

పనికిరాని సినిమాలు అనేకం తీస్తుంటారు, పాటలు, పద్యాలు, కథలు, ఘజల్స్ వంటి అన్నింటినీ ఈ చెత్తతో నింపేస్తుంటారు. కానీ మహారాణ ప్రతాప్, ఛత్రపతి శివాజి, గురుగోవింద్ సింగ్, ఛాత్రసాల్, గజ్ సింగ్, దుర్గాదాస్, రణసంగ, రణకుంభ మొదలైన మహావీరులు, సత్పురుషుల గురించి వ్రాయడానికి మాత్రం ఎటువంటి ప్రయత్నం చేయరు. దుర్మార్గులు, దుష్టులను, దేశద్రోహులను ఉదాత్తస్వభావులుగా చూపించడానికి నిర్లజ్జగా ప్రయత్నిస్తుంటారు, దానిలో ఆనందం పొందుతారు. ఈ అసహ్యకరమైన ప్రవర్తన ఎంతో గొప్పదిగా భావిస్తుంటారు.

మట్టిని బంగారంగా మలిచే రసవేదం ఒక అద్భుతమైన శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం. కాని మన చరిత్రలో మాత్రం దానికి స్థానం దక్కదు. ఎందుకంటే ఈ మేధావుల దృష్టిలో అటువంటి వాస్తవిక విద్యలన్నీ కూడ నమ్మశక్యంకానివీ, పుక్కిటిపురాణాలూను! అందుకే ఈ వ్యవస్థ మనని కట్టుకథలు, కల్పితాలు, నవలలు, నాటకాలు, సినిమాలు, ఫ్యాషన్, మార్కెటింగ్, బ్రాండింగ్ వంటి వాటి చాటున బ్రతికేలా చేస్తుంది. అసలే నిద్రావస్థలో ఉన్న మన జాతికి ఇది మరింత చేటు చేస్తుంది. అక్బర్ వంటి ఉగ్రవాదిని ఆకర్షణీయంగా చూపిస్తుంది జోధా అక్బర్. నేరస్తుడు, స్త్రీలను చెరచేవాడు, కామ పిశాచి అయిన జహంగీర్ ను శృంగార వీరుడిగా చిత్రిస్తుంది మొఘల్-ఏ-ఆజమ్. అటువంటి చిత్రాలకి విమర్శకులందరినుండి అద్భుతమైన ప్రశంశలందుతాయి. ఈ క్రమంలో అసలే మత్తులో జోగుతున్న ప్రజల మనసుల్లో ఈ కట్టుకథలు చెరగని ముద్రవేస్తాయి.

వీటన్నిటికీతోడు, బాల్యంనుండే ఉగ్రవాదుల్ని పెంచిపోషిస్తూ, హిందువులలో న్యూనతాభావాన్ని కలిగిస్తూ, జాతిని నిర్వీర్యం చేసే ప్రక్రియ కొనసాగుతుంది. విద్యావ్యవస్థ ద్వారా, చరిత్ర పుస్తకాల ద్వారా, తపాళా బిళ్లలు, కళలు, సృజనాత్మక మాధ్యమాల ద్వారా, ఇంకా అనేక విధాలుగా ఈ క్రింది అపోహల్ని మన మనసుల్లోకి బలవంతంగా చొప్పిస్తున్నారు -

- ఆర్యులు భారతీయులు కారని, వారు భారతీయుల ధనం, మాన, ప్రాణాలను దోచుకున్నారని
- ప్రతి కసాయి ముస్లిం పాలకుడు ఒక సాధువు అని
- తాగుబోతు, 'హరామి', ఉగ్రవాది, స్వలింగ సంపర్కుడు, పిల్లలను కామించి, హింసించే కౄరుడు అయిన బాబర్ ఒక పవిత్రుడని
- షాజహాన్ ఒక ప్రేమమూర్తి అని, తన నాల్గవ భార్య (మొత్తం ఏడుగురు భార్యలు) జ్ఞాపకార్థం తాజ్ మహల్ ను కట్టించాడని. నిజానికి షాజహాన్ ఒక కామ పిశాచి. ముంతాజ్ భర్తను చంపి, ఆమెను చెరపట్టి, ఆమె ద్వారా 14 మంది సంతానాన్ని కన్నాడు షాజహాన్. తన 14వ కాన్పులో బిడ్డకు జన్మనిస్తూ చనిపోయింది ముంతాజ్. ఆమె మరణించిన తరువాత ఆమె చెల్లెల్ని చెరపట్టాడు.

ఇలా ఇంకెన్నో...

ఇటువంటి భావజాలంతో పెరిగిన మనం ఈ 'కుహనా లౌకికవాదాన్ని' కాపాడడానికి లాఠీ పట్టుకు బయలుదేరుతాం. మన నిజమైన చరిత్ర-ను మనమే నాశనం చేసుకుంటాం. ఈ వ్యవస్థ ఒక కర్మాగారం లాంటిది. దీన్నుండి ఉగ్రవాదులు, అసమర్థులు పుంఖానుపుంఖాలుగా పుట్టుకొ-స్తారు. ఈ నపుంసక చర్యలన్నీ సమర్థంగా ఎదుర్కొని నిలబడుతున్న మనలాంటి కొందరు మాత్రం మన సాటివారు దేశద్రోహులుగా మారడం చూసి బాధపడుతూ ఉండిపోవలసివస్తుంది.

ఓ కొద్ది మంది మాత్రం, మనకు తరతరాలుగా జరుగుతున్న అన్యాయా-న్ని రూపు మాపి నిజాలను చాటుదామనే తాపత్రయంతో బ్రతుకుతు-న్నారు. ఈ లక్ష్యాన్ని చేరుకోవడం  కోసం ఇంటా బయటా శత్రువులతో పోరాటం సాగిస్తున్నారు. ఈ అంతు చిక్కని లక్ష్యసాధనలో జీవితాలనీ, కుటుంబాలనీ కూడ త్యాగం చేస్తున్నారు. వీరు ఎదుర్కొంటున్న శత్రు-వులెవరో, వీరు కాపాడాలనుకొనే మిత్రులెవరో తెలియని పరిస్థితి. ఎటు చూసినా అందరూ కలగలిసి ఉన్నారు. కానీ వారికి లక్ష్యం మాత్రం స్ప-ష్టంగా తెలుసు. అది మన ధర్మాన్ని ఉన్నత స్థానంలో నిలపడం, ఆ ధర్మాన్ని కాపాడడం కోసం శ్రమించినవారికి కృతజ్ఞులై ఉండడం. మన లక్ష్యానికి గత 1000 సంవత్సరాల్లో ఎన్నడూ రానంత దగ్గరగా ఈనాడు మనం చేరుకున్నామంటే దానికి వారందరి అవిశ్రాంత కృషే కారణం.

అనుచిత లౌకికవాదం, దేశద్రోహులు, విద్యావ్యవస్థ వల్ల మనకు కలిగిన నష్టం పూడ్చాలంటే మన నిజమైన చరిత్రని వెలుగులోకి తేవడమెక్కటే మార్గం. అదీ ఖచ్చితమైన ఆధారాలతో కూడినదై ఉండి అనుమానాలకు తావివ్వకుండా ఉండాలి.

ఈ పుస్తకం 'భారతదేశ చరిత్ర పునరుజ్జీవనం' శీర్షిక క్రింద అగ్నివీర్ నుండి వెలువడిన రెండవది. ఈ పుస్తకం బాబర్, అక్బర్, షాజహాన్, ఔరంగజేబ్, టిప్పుసుల్తాన్ వంటి వారి నిజస్వరూపాల్ని బయటపెడ్తుంది. భరతఖండంపై ఈ జిహాదీ నరరూప రాక్షసులు జరిపిన దురాగతాల్ని వెలుగులోకి తెస్తుంది. ఈ పుస్తకం చదివిన పాఠకులకు మొఘలులకాలంలో భరతమాత అనుభవించిన వేదన అర్థమవుతుంది. మొఘులులను ఎదుర్కొన్న మన వీరులు చేసిన త్యాగాలు తెలుస్తాయి. ఆ వీరులే మనకు ఆదర్శమూర్తులు.

ఈ పుస్తకం ద్వారా అగ్నివీర్ దేశం కోసం, ధర్మం కోసం పోరాడిన ఆ వీరులకు నివాళులు అర్పిస్తుంది. రాణప్రతాప్, శివాజి, గురుగోవింద్ సింగ్, వీర్ బంద బహద్దూర్ వంటి అనేకానేక వీరులు ఈనాడు మనం తలెత్తుకు బ్రతకడానికి ఎన్నెన్నో త్యాగాలు చేశారు. వారి త్యాగాలను ఈ పుస్తకం ద్వారా దేశానికి తెలియజేయాలనే మా ఈ చిన్న ప్రయత్నం.

కానీ ఇక్కడ గుర్తించాల్సిన ముఖ్య విషయం ఏమిటంటే ఈ పుస్తకం మొఘులులను ఎదుర్కొన్న వీరుల గాథలను ఆధారంగా చేసుకుని వ్రాసింది కాదు. అతివాద చరిత్రకారులు, నిజమైన దేశభక్తులు వ్రాసిన పుస్తకాల ఆధారంగా వ్రాసింది అంతకన్నా కాదు. మొఘులులను అతిగా ఆరాధించిన వారు, మొఘులుల భట్రాజులు వ్రాసిన వాటి ఆధారంగానే మొఘులుల నిజస్వరూపం ఈ పుస్తకంలో వర్ణించబడింది. ఈ పుస్తకంలో వ్రాసిన వాస్తవాలన్నీ కూడ మొఘుల్ పాలకుల ఆత్మ కథలు, మొఘులుల ఆస్థాన చరిత్రకారులు వ్రాసిన పుస్తకాలు, మొఘుల్ చరిత్రపై పట్టు ఉన్న అత్యంత నమ్మశక్యమైన మేధావుల రచనల ఆధారంగా వ్రాసినవే. బాలీవుడ్ సినిమాల ప్రభావంతో మొఘుల్ వంశస్థులు ప్రేమమూర్తులని, ప్రజాశ్రేయస్సును కోరే ఉదాత్త స్వభావులనీ మీకు కలిగిన అభిప్రాయాలకు ఈ పుస్తకంలో వారి స్వభావాల్ని వివరించిన తీరు పూర్తి విరుద్ధంగా ఉన్నట్లు మీరు గమనించినట్లయితే మీరు ఊహా ప్రపంచం నుండి నిజ జీవితంలోకి అడుగు పెట్టారని తెలుసుకోండి.

ఈ పుస్తకం అమ్మకాల ద్వారా వచ్చిన పూర్తి మొత్తాన్ని మన చరిత్ర పునరుజ్జీవనానికి మాత్రమే ఖర్చు చేయడం జరుగుతుంది. ఈ పుస్తకాన్ని మీరు చదివడం, ఇతరులతో చదివించడం, కానుకగా ఇవ్వడం, మీ అనుభవాలను పంచుకోవడం ద్వారా మొఘలుల చీకటి గాథలు వెలుగులోకి తెచ్చి మన చరిత్రను కాపాడినవారవుతారని ఆశిస్తాను.

ఇట్లు,

**మీ వశి శర్మ**
**ఐఐటి ముంబాయి**

# గమనిక

ఈ పుస్తకంలో నేను విమర్శించిన 'ఇస్లాం' కేవలం ముస్లిం ఛాందస-వాదులు, వారి అనుచరులు నమ్మినటువంటి, ఆచరిస్తున్నటువంటి భావజాలం మాత్రమే. వారు ఆచరించే 'ఇస్లాం'లో సర్వ మానవ సమా-నత్వం ఉండదు, ఇతర మతస్తులకు స్వర్గ ప్రాప్తి ఉండదని, 'ఇస్లాం'ని నమ్మని వారిని హత్య చేయడం సబబేనని చెప్పబడుతుంది. నేను విమ-ర్శించే 'ఖురాన్' ఈ మత ఛాందసులు వారికి నచ్చినవిధంగా అనువదిం-చుకొని, బలహీన మనస్కులను ఉగ్రవాదానికి ఉసిగొల్పడానికి ఇంటర్నె-ట్లో విచ్చలవిడిగా ప్రచారం చేస్తున్న అబద్ధపు వ్రాతలు మాత్రమే. ఇస్లాం, ఖురాన్ లను మానవతావాదులైన మేధావులు అర్థం చేసుకునే విధానం వేరుగా ఉంటుంది. కానీ మత ఛాందసవాదులు వీరిని మతభ్రష్టులుగా ముద్ర వేస్తారు, వారిని దూషించి అవమానాలకు గురి చేస్తారు. మాకు ఆ మానవతావాదులపైన, వారి నమ్మకాలపైన గౌరవమేకానీ ఈ పుస్తకం వారి గురించి కాదు. ఈ పుస్తకంలో మేము వెలిబుచ్చిన అభిప్రాయాలేవీ వారి గురించి కాదు. మా విమర్శలు కేవలం మత ఛాందసులపైన, వారి ఆగడాలపైన మాత్రమే.

# విషయసూచిక

# 1

# ముస్లిం సుల్తానులు, వారి స్వలింగ సంపర్క వికృత చేష్ఠలు

అవును, మీరు చదివింది నిజమే! మొఘులుల వికృత లైంగిక చేష్ఠలు చరిత్రలో కప్పివేయబడ్డాయి. ఇస్లామిక్ దేశాల్లో స్వలింగసంపర్కుల తలలు నరికివేస్తారు. కానీ దాదాపు ప్రతి ముస్లిం సుల్తానూ స్వలింగ-సంపర్కానికి బానిసే. వాళ్లు కేవలం స్వలింగసంపర్కులే కారు. వాళ్ల కుతిని చల్లార్చుకోవడానికి ఎంతటి నీచమయిన పనికైనా ఒడిగట్టే కామ పిశాచులు కూడ. వీళ్ల వికృత చేష్ఠలు మధ్యయుగం నాటి భారతీయ చరి-త్రను మార్చివేశాయి. ఈ సుల్తానులు ఆడ, మగ వేశ్యలను కూడ బాని-సలుగా ఉంచుకొనేవారు. అది వారికి జన్మతః సంక్రమించిన పవిత్రమైన హక్కుగా భావించేవారు.

స్వర్ణయుగంగా పిలవబడుతున్న ఇస్లామిక్ పాలనలోనే భారతదేశంలో బానిసత్వానికి పునాదులు పడ్డాయి. 'ఘిల్మన్' అని పిలవబడే మగ వేశ్యలు సుల్తానుల దగ్గర బానిసలుగా ఉండేవారు. వారి పవిత్రగ్రంథం-

లో వర్ణించినట్లు ఘిల్మన్లు నీలి కళ్లు, మెత్తని చర్మం, అందమైన ముఖం కలిగి ఉండేవారు. ముస్లిమ్ సుల్తానులు బానిసలకు లింగ భేదం పాటించలేదు. తమ 'హరెం' (అంతఃపురం/వేశ్యావాటిక) లలో మగ వేశ్యలకు సమానంగా ఆడ వేశ్యలను కూడ ఉంచుకునేవారు. నీలి కళ్ల ఘిల్మన్లు, సుల్తానుల మధ్య నడచిన రాసలీలు ఎన్నో.

మహముద్ ఘజనవీ సుల్తాను ఆస్థానంలో అబ్దుల్ అబ్బాస్ ఫజల్ బిన్ అహ్మద్ అని ఒక మంత్రి ఉండేవాడు. అతని ఇంట్లో గడ్డం లేని, వీనస్ అంత అందంగా ఉండే ఒక అబ్బాయి ఉన్నాడని తెలుసుకున్న సుల్తాను మంత్రిని తనముందుకు పిలిపించి అబ్బాయి విషయం అడిగాడు [దస్తురుల్ వుజ్రా లో ఖోందమీర్]. అటువంటివారు తన ఇంట్లో ఎవరూ లేరని మంత్రి చెప్పడంతో అతనిని ఆస్థానం నుండి గెంటివేయడమేకాకుండా అతని ఇంటిని నేలమట్టం చేయించాడు సుల్తాన్. ఘజనవీకి గడ్డం లేని అబ్బాయిలమీద అంతటి కోరిక ఉండేది.

**అల్లాఉద్దీన్ ఖిల్జీ** గుజరాత్ పై దండెత్తి రాజా కరణ్ సింగ్ పట్టమహిషి అయిన రాణి కమలా దేవిని చెరపట్టాడు. గుజరాత్ లోని ఖంబత్ లో ఒక ధనవంతుడైన ఖ్వాజ దగ్గర కఫుర్ హజార్ దినారి అనే మగ వేశ్యా బానిస ఉండేవాడు. అతను ఒకప్పుడు హిందువు. ఖ్వాజ 1,000 దినార్లకు కఫుర్ని కొన్నాడు. గుజరాత్ పై దండెత్తినప్పుడు ఖిల్జీ కఫుర్ని కూడ ఎత్తుకుపోయాడు. రాణీ కమలాదేవి, కఫుర్ ఇరువురినీ తనదైన శైలిలో ప్రేమించాడు ఖిల్జీ. కమలాదేవిని ఇస్లాం మతంలోకి మార్చి వివాహం చేసుకున్నాడు. కఫుర్ పై ప్రేమకు చిహ్నంగా ఒక పవిత్ర 'జన్నార్' [ముస్లిం రాజ్యంలో అనుమతి పొందిన ముస్లిమేతరులు నడుముకు కట్టుకోవలసిన గుడ్డ]ను కట్టుకొని తిరిగేవాడు. ఈ ముగ్గురి మధ్య ఉన్న 'ప్రేమకథ' ను సినిమాగా తీయాలంటే బాలీవుడ్ దర్శకుడు సంజయ్ లీల భన్సాలి వంటివాడు సరిపోతాడు. చిత్తోర్ మహారాణి రాణి పద్మిని కి ఖిల్జీకి మధ్య గల 'ప్రేమ కథ' ను ఇతగాడు ఈ మధ్యనే తెరకెక్కించాడు. నిజానికి అది ప్రేమ కథ కాదు. కాఫిర్ స్త్రీలపైన ఇస్లామిక్ మతోన్మాదులకున్న కామ దాహం.

కఫుర్ హజార్ దినారి (లేదా, మాలిక్ కఫుర్) ని తరువాతి కాలంలో రాజప్రతినిధిగా నియమించాడు సుల్తాను. కఫుర్ ఎప్పటికీ మగవాడు అవకుండా ఉండడం కోసం, 'ప్రేమకు' పనికివచ్చేట్టు సున్నితంగా ఉండడం కోసం అతని వృషణాలు తీసివేయించాడు సుల్తాను. ఇటువంటివాటి వల్ల ఆయనకి అనేక లాభాలున్నాయి -

- తన వేశ్యా బానిసలను తను తప్ప తన మగ బానిసలెవరూ అనుభవించకుండా ఉంటారు.
- రాచవేశ్యావాటికలను నిర్వహించి, వాటి బాగోగులు చూడడానికి ఈ నపుంసకులు పనికివస్తారు.
- వృషణాలు తీసివేయడం వలన మగ వేశ్యలు ఎప్పటికీ సున్నితంగా, సుకుమారంగా ఉండిపోతారు.
- నపుంసకులను సైన్యంలో, ఆస్థానంలో, రాచవేశ్యావాటికల్లో ఉన్నత పదవుల్లో ఉంచినా వారు లైంగిక ప్రలోభాలకు లొంగకుండా ఉంటారు. లైంగిక సంబంధాల మీదే ఆధారపడిన సుల్తానుల సంస్కృతిలో ఇటువంటి జాగ్రత్తలు ఎంతో అవసరం.

**సుల్తాన్ ముబారక్ ఖిల్జీ** కూడ గడ్డంలేని మగపిల్లలను కోరుకునే ప్రేమికుడే. ఈయన ఖుస్రు అనే ఘిల్మన్‌ను విపరీతంగా ప్రేమించాడు. సుల్తానుకి ఖుస్రు పెర్రిగా ప్రేమించే ఓ ఇస్లామిక్ భార్య వంటివాడు. సుల్తానుకి పక్కలోనూ, బయటా కూడ ఆనందాన్నిచ్చేవాడు. తన దక్షిణాది సైన్యానికి సైన్యాధ్యక్షుడిగా ఖుస్రుని నియమించాడు సుల్తాను.

కానీ చివరికి వీళ్ల ప్రేమకథ దుఃఖాంతమయింది. ఒకరోజు రాత్రి సుల్తాను పక్కలో చేరిన ఖుస్రు అదను చూసి సుల్తాను మర్మాంగాన్ని కోసేశాడు. ఆ తరువాత క్రిందినుండి బాకుతో పొడిచి సుల్తానుని దారుణంగా హత్య చేశాడు ఖుస్రు. ప్రేమను పంచిన చేతులతోనే సుల్తాను ప్రాణాలను తీసేశాడు. సుల్తానుని చంపిన ఖుస్రు తరువాత తనే సుల్తాను అయ్యాడు.

నీలి కళ్ల ఘిల్మన్లను ప్రేమించి తన అంతఃపురంలో ఉంచుకున్న మరొక ముస్లిం రాజు **సుల్తాన్ సికందర్ లోధి**. ఈయనకి వైవిధ్యం కావాలి. ప్రతి రాత్రి ఒక కొత్త ముఖాన్ని కోరుకునేవాడు. ఈయన పగలు ముస్లిం పాలనలో విగ్రహారాధన చేసే కాఫిర్లను నరికి చంపే నరరూప రాక్షసుడు. రాత్రి మగ, ఆడ వేశ్యలతో సామూహిక శృంగారం సాగిస్తూ తన అంతఃపురాన్ని వాళ్లు నమ్మే ఇస్లామిక్ స్వర్గంగా మార్చేసే శృంగారపురుషుడు.

సుల్తానుకి అత్యంత ఇష్టులైన మగ వేశ్యలపైన మిగతావారికి అసూయ, ద్వేషాలు ఏర్పడేవి. దీంతో వాళ్లకి చాలామంది శత్రువులయ్యేవారు. సుల్తాను చనిపోయిన వెంటనే ఆ ఘిల్మన్లందరినీ నరికేసేవాడు కొత్త

సుల్తాను. ఘోరి, బాబర్, అక్బర్, ఔరంగజేబ్, బహదూర్షా ఇలా ప్రతి ఒక్కరూ ఘిల్మన్లను ఊచకోత కోసినవారే.

ఫిరోజ్ షా తుగ్లక్ ఉంచుకున్న ఘిల్మన్లు మూడు రోజుల్లో దేశం విడిచి పారిపోవాలని, లేదంటే తన కత్తికి బలవుతారని **మహమద్ బిన్ తుగ్లక్** ఎలా ఆదేశాలిచ్చిందీ వివరిస్తాడు ఫెరిష్టా తన పుస్తకంలో. వారిలో 'నాణ్యమైన' వారిని కొందరిని మాత్రం తన చీకటి కోరికలు తీర్చుకోడానికి ఎంచుకుని ఆశ్రయం కల్పించాడు తుగ్లక్.

**ఘియాసుద్దీన్ తుగ్లక్** కి గడ్డంలేని కుర్రవాళ్ల వ్యామోహం లేకపోవడం అల్లా కృపేనంటాడు జియాఉద్దీన్ బరాని. కానీ అతని కొడుకు మహ్మద్ బిన్ తుగ్లక్ అల్లా ఆదేశాలకి విరుద్ధంగా మగ వేశ్యాలోలుడు అవడంతో బరానికి నిరాశే మిగిలింది. ఈ వ్యామోహమే తండ్రీ కొడుకుల మధ్య గొడవలకి కారణమయిందని అంటాడు ఇబ్న్ బతూత.

మగపిల్లల వ్యామోహం సుల్తానులలో ఎంత ఎక్కువగా ప్రబలి ఉండేదంటే వారి ఆస్థానాల్లో దీనికోసం ఒక ప్రత్యేక విభాగం కూడ ఉండేది. నపుంసకులను ముఖ్యమైన పదవుల్లో ఉంచడానికి ఇష్టపడేవారు సుల్తానులు. కాపలాదారులనుండి వజీర్ల వరకు అందరూ వాళ్లే ఉండేవారు. వీళ్లందరూ కూడ రాజు అనుభవించడం కోసం వృషణాలు తీసివేసి ప్రత్యేకంగా సిద్ధం చేయబడినవారే.

ఒక విధంగా చెప్పాలంటే కేవలం రాజుల శారీరక వాంఛలను తీర్చడం కోసం అమాయకుల వృషణాలు నరికివేయడం, వారి కుతి తీరిన తరువాత చంపేయడం అనే హేయమైన ఆనవాయితీని నిర్లజ్జగా కొనసాగించేవారు. ఇటువంటి దుర్మార్గులు మన ఉదారవాద చరిత్రకారులకి హేతుబద్ధులుగా, మానవతావాదులుగా కనపడుతారు.

మొత్తంమీద సుల్తానులు పరి పరి విధాలుగా వారి శారీరక, మానసిక వికృత కోర్కెలు తీర్చుకొనేవారు.

- ముస్లిమేతర స్త్రీలను, ఆడపిల్లలను బలవంతంగా ఎత్తుకు వెళ్లి చెరచడం
- గడ్డంలేని బాలురతో మైథునం

- మగవారిని శారీరకంగా వాడుకుని చంపడం
- యువకుల వృషణాలు తీసివేయించి వారిని ప్రేమికులుగా ఉంచుకోవడం
- లెక్కలేనంత మందిని తాత్కాలికంగా పెళ్లిళ్లు చేసుకోవడం (మిస్యర్, ముతాహ్)

ఈసారి ఎవరైనా ఇస్లామిక్ స్వర్ణయుగం గురించి మీ ముందు మాట్లాడే ప్రయత్నం చేస్తే సుల్తానుల స్వలింగ సంపర్కాలు, బలాత్కారాలు, మగపిల్లలపై వారికి కల పెర్రి వ్యామోహాలు, వారి వికృత చేష్టల గురించి కూడ మాట్లాడమని చెప్పండి.

# 2

# మొఘలులు - స్వంత కుటుంబాలనే కడతేర్చిన నరహంతకులు

మధ్యయుగంలో భారతదేశానికి ఏదైనా మంచి జరిగిందంటే అది మొఘలుల పాలనే అని 'ఉదారవాద' చరిత్రకారులు చేప్తారు. మొఘలులు దేశంలో ఎనలేని అభివృద్ధిని తీసుకువచ్చారని వామపక్ష చరిత్రకారులు పుకార్లు పుట్టిస్తారు. కానీ కాస్త జాగ్రత్తగా గమనిస్తే మొఘలులకు వారి ప్రజలమీద, ప్రజల బాగోగులమీద ఏమాత్రం ఆసక్తి ఉండేదో మనకిట్టే అర్థ-మవుతుంది. వాళ్లు చేసిన చెడు అంతా కళ్లకు కట్టినట్టు కనబడుతుంది.

మొఘలుల వంశ చరిత్రలో ఏ భాగాన్ని తీసి చూసినా సోదర హత్యలతో నిండి ఉంటుంది. రాజ్యాధికారం కోసం వాళ్లలో వాళ్లు కోడిపుంజుల్లా ఎలా కాట్లాడుకొనేవారో ఉంటుంది.

సింహాసనాన్ని దక్కించుకోవడం కోసం స్వంత తండ్రులను, కొడుకులను, సోదరులను చంపడానికి కూడ వెనకాడని వాళ్లు ప్రజలను బాగా చూ-

సుకుంటారని ఎలా నమ్ముతాం? స్వంత వాళ్లనే పొట్టన పెట్టుకొన్న మత ఛాందసులు ముస్లిమేతరులను క్షమించి వదిలారంటే ఎలా నమ్మడం? ఒక సాధారణ ముస్లిం వీళ్ల కబంధ హస్తాలనుండి తప్పించుకొని బ్రతికా-డంటే అదెలా నమ్మగలం?

ఇస్లాంని శాంతియుతమైనదిగా ప్రచారం చేస్తూ ఈ నరరూప రాక్షసులు ఎంతటి అఘాయిత్యాలకు పాల్పడ్డారో సోదాహరణంగా మనం చూద్దాం. ఈ అధ్యాయం మొత్తం ఛాందసులు ఇస్లాం కోసం స్వంత వారినీ, రక్తసం-బంధీకులను ఎలా చిత్రహింసలకు గురి చేసి చంపారనే విషయం ఒక్కటే మనం చర్చించుకుందాం. ఇస్లాం భారతదేశంలోకి అడుగు పెట్టక ముందు నుండి ఏమి జరిగిందో తెలుసుకుందాం.

## మహమ్మద్ ప్రవక్త మరణం తరువాత

ఇస్లామిక్ పాలకుల వంశాల్లో తోడబుట్టినవారిని, స్వంత వారిని చంపని వాడు లేడు

ఇస్లాం మత వ్యవస్థాపకుడైన మహమ్మద్ ప్రవక్తను ఆయన భార్యలు అయేష, హఫ్స లే హత్య చేశారని అనేకమంది ఇస్లామిక్ మేధావులు చెప్తారు.

మహమ్మద్ ప్రవక్త తరువాత ఒక వివాదాస్పద పోరులో అలీ ని ఓడించి అబు బక్ర్ ఖలీఫ్ (ఇస్లామిక్ మత పెద్ద) అయ్యాడు. ఈ వివాదం షియా, సున్నీ తెగల చీలికకి దారి తీసింది. మహమ్మద్ ప్రవక్తకు అలీ అల్లుడు. అతను ప్రవక్తకు అత్యంత సన్నిహితుడు, తెలివైనవాడు.

అబు బక్ర్ ని ఒక సన్నిహితుడు విషమిచ్చి చంపాడని ప్రతీతి.

ఉమర్ తరువాతి ఖలీఫ్ అయ్యాడు కాని ఒక ముస్లిం బానిస చేతిలో అనుమానాస్పదంగా చనిపోయాడు.

తరువాత ఉత్మాన్ ఖలీఫ్ అయ్యాడు. అతను మొట్టమొదటి సారి ఖురాన్ ని సంకలనం చేసాడు. అతడొకనాడు ఖురాన్ చదువుతుండగా అబు బక్ర్ కొడుకు అతన్ని చంపివేసాడు.

ఆఖరికి అలీ ఖలీఫ్ అయ్యాడు కానీ ఒకనాడు నమాజ్ చేస్తుండగా అతను కూడ సహచరుల చేతిలో చంపబడ్డాడు.

వీటికి ముందు, అల్లా దివ్య కృపవల్ల మహమ్మద్ ప్రవక్త కి భార్య, అబు బక్ర్ కి కూతురు అయిన అయేష కి అలీకి యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో ఓడిన అయేష ని అలీ బంధించి మదీనలో ఖైదు చేసాడు. అయేషా కూడ చంపబడిందని చాలా మంది మేథావుల అభిప్రాయం.

ఎంతో మంది మత పెద్దలు హత్యకు గురవ్వడం చూసి అలీ కొడుకు అయిన హసన్ ఖలీఫ్ అవడానికి నిరాకరించాడు. అయినా స్వంత భార్య చేతిలోనే హతమయ్యాడు. హసన్ ఒప్పుకోకపోవడంతో ఈజిప్టు గవర్న-రు అయిన ముఆవియాహ్ తరువాతి ఖలీఫ్ అయ్యాడు. అతను చేసిన కుట్రతోనే హసన్ భార్య చేతిలో చంపబడ్డాడు.

ముఅవియాహ్ తరువాత అతని కొడుకు యజీద్ ఖలీఫ్ అయ్యాడు. ఇతను మరో భయంకరమైన నరహంతకుడు. ప్రవక్త మనుమడు హుస్సేన్ ని కర్బల యుద్ధంలో చంపాడు యజీద్. దానివల్లే ముహర్రం జరుగుతుంది. ఇతర ముస్లిం తెగల వారికి యజీద్ అంటే గిట్టదు కానీ జాకీర్ నాయక్ వంటి ముస్లిం ప్రచారకులకి అతనంటే వల్లమాలిన గౌరవం. అందుకే జాకీర్ నాయక్ కు చాలా తెగలు ఫత్వాలు పంపించాయి.

ముఅవియాహ్ ఉమయ్యాద్ వంశస్థుడు. యజీద్ హత్యతో మతపెద్దరికం పూర్తిగా ఉమయ్యాద్ వంశస్థుల చేతిలోకి వెళ్లిపోయింది. ప్రవక్త కుటుంబ సభ్యులనీ, అతని అనుచరులనందరినీ అడ్డు తొలగించుకున్న తరువాత మత పెద్దరికం కోసం ఉమయ్యాద్ వంశస్థులు ఒకరినొకరు చంపుకోవడం ప్రారంభించారు.

## భారతదేశంలోకి ఇస్లాం ప్రవేశంచిన తరువాత

స్వంత వారినీ, చుట్టాలనీ, అనుచరులనీ చంపుకోని ఇస్లామిక్ పాలకుల తరం ఒక్కటికూడ లేదు.

కొద్ది సంవత్సరాలకే ఖలీఫ్ వలీద్ చనిపోయినతరువాత అతని సోదరుడు సులేమాన్ ఖలీఫ్ అయ్యాడు. వెంటనే వలీద్ కొడుకు ఖలీఫ్ అవ్వాలని కోరుకున్న వారందరిని ఊచకోత కోశాడు సులేమాన్.

వలీద్ ఖలీఫ్ గా ఉన్నప్పుడు ముహమ్మద్ బిన్ ఖాసిం ని భారత్ పైకి దండెత్తమని పంపించాడు. సింధు రాజ్యానికి ఆఖరి రాజైన రాజా దాహిర్ ని యుద్ధంలో ఓడించి అతన్ని చంపేసాడు ఖాసిం. కాఫిర్ యువతులు

ఖలీఫ్ కి వేశ్యా బానిసలుగా ఉండాలని 'పవిత్ర గ్రంథం' చెప్తుంది. రాజా దాహిర్ కుమార్తెలను ఖాసిం బంధించి తీసుకువెళ్లాడు. కానీ అప్పటి-కి ఖలీఫ్  అయిన సులేమాన్ కి ఖాసిం ముందే దాహిర్ కుమార్తెలను అనుభవించి ఉంటాడని అనుమానం వచ్చి అతన్ని ఎద్దు చర్మంలో కుట్టి తీసుకురమ్మని తన వారికి ఆదేశించాడు.

ఇస్లామిక్ మతాధికారం కోసం ఎందరో ఖలీఫ్ లు ఇలా అసహజ మరణాల పాలయ్యారు - విష ప్రయోగం, హత్య, 'అంతు చిక్కని రోగాల' బారిన పడడం వగైర.

హిందువులు ఎదురుతిరిగినప్పుడు ఖాసింకి ఎదురైన ఓటములు చూసి ముస్లిం పాలకులు 250 సంవత్సరాలవరకు మళ్లి భారత్ పైకి దండె-త్తడానికే భయపడిపోయారు. అప్పుడు మహ్మూద్ ఘజనీ శకం మొ-దలయింది. భారతదేశాన్ని పకడ్బందీ వ్యూహాలతో దోచుకున్న రెండవ కసాయి వీడు. ఇస్లాంని భారతదేశంలో విస్తరింపజేసిన వాళ్లలో ప్రము-ఖుడు ఘజని. అతనికి తొమ్మిది మంది భార్యలు, లెక్కలేనంత మంది ఉంపుడుగత్తెలు ఉండేవారు.

మహ్మూద్ ఘజనీ తండ్రి పేరు సుబుక్తిగీన్. సుబుక్తిగీన్ కి మహ్మూద్ కాక ఇస్మాయిల్ అని ఇంకొక కొడుకు ఉన్నాడు. సుబుక్తిగీన్ ఇస్మాయిల్ ని తన వారసుడిగా ఎన్నుకున్నాడు. కానీ మహ్మూద్ తన సోదరుడిని ఖైదు చేసి, మరణదండన విధించి రాజ్యాన్ని కైవసం చేసుకున్నాడు.

అలాగే మహ్మూద్ చనిపోయిన తరువాత అతని కొడుకులు మసూద్, ముహమ్మద్ ల మధ్య ఆధిపత్య పోరు చెలరేగింది. చివరికి మసూద్ గెలిచి తన సోదరుడు ముహమ్మద్ ని గుడ్డివాడిగా మార్చేసాడు. కానీ ముహ-మ్మద్ మళ్లీ మసూద్ పైన తిరుగుబాటు చేయించి అతన్ని బంధించాడు.

మసూద్ ని చంపి ముహమ్మద్ సుల్తాన్ అయ్యాడు. కానీ కొంత కాలానికి మసూద్ కొడుకు మదూద్ కుట్ర పన్ని ముహమ్మద్ ని అతని కొడుకుని బంధించి ఇద్దరినీ చంపేసాడు.

ఘజిని తరువాత 140 సంవత్సరాల వరకు ముస్లిం పాలకులు భారతదే-శంపై దండెత్తే ధైర్యం చేయలేకపోయారు. ఘజిని మేనల్లుడు చేసిన ఒక్క ప్రయత్నాన్నీ హిందువులు గట్టిగా తిప్పికొట్టారు.

భారత్ పైన దండెత్తిన నరరూప రాక్షసుల్లో మూడవ వాడు మహమ్మద్ ఘోరి. వీడు ద్రోహానికీ, కౄరత్వానికి పరాకాష్ఠ. ఘోరికి సంతానం లేదు. అందుకే తన వేశ్యాబానిసలు ఖుతుబుద్దిన్ అయ్బక్, బఖ్తియార్ ఖిల్జిల-ను తన వారసులుగా చేసుకున్నాడు.

బఖ్తియార్ ఖిల్జి తన బంధువు అలీ మర్దాన్ చేతిలో హతమయ్యాడు. ఖు-త్బుద్దిన్ అయ్బక్ అధికారాన్ని కొడుకు అరమ్ షా లాగేసుకున్నాడు. కానీ అయ్బక్ వేశ్య, అతనికి అల్లుడు కూడ అయిన ఇల్టుట్మిష్ అరమ్ షా ని చంపి తను సుల్తాన్ అయ్యాడు.

ఇల్టుట్మిష్ తన కూతురు రజియాకు రాజ్యాధికారాన్ని అప్పగించాలను-కున్నాడు. కానీ అతని కొడుకు రుకునుద్దిన్ సింహాసనాన్ని కైవసం చే-సుకున్నాడు. రజియా తన సోదరుడ్ని, తల్లిని చంపించి తిరిగి అధికారం చేజిక్కించుకుంది. తరువాత ఒక బానిసతో శారీరక సంబంధం పెట్టుకున్న రజియా అతన్ని ముఖ్య సలహాదారునిగా నియమించుకుంది.

ఇదిలా ఉండగా పంజాబ్ గవర్నరు అల్ తునియా తిరుగుబాటు చేసి రజియాను, ఆమె ప్రేమికుడిని బంధించాడు. ప్రేమికుడిని చంపించి, రజియాను తన ఉంపుడుగత్తెగా చేసుకున్నాడు.

ఇంకొకవైపు రజియా మరో సోదరుడు బహ్రాం షా ఢిల్లీ సింహాసనంపై దం-డెత్తాడు. దీంతో రజియా, అల్ తునియాలు బహ్రాం పై యుద్ధానికి వెళ్లారు కానీ బహ్రాం చేతిలో చిత్తుగా ఓడిపోయారు. ప్రాణాలరచేతిలో పెట్టుకుని పారిపోతున్న రజియా, అల్ తునియాలను వెంటాడి చంపాడు బహ్రాం.

తరువాత బహ్రాం కూడ హత్య చేయబడ్డాడు. అప్పుడు రుకునుద్దిన్ కొడుకు మసూద్ షా సింహాసనాన్ని ఎక్కాడు. కానీ మసూద్ షా సో-దరుడైన నసీరుద్దీన్, అతని అల్లుడు బల్బన్ లు కలిసి మసూద్ ని అడ్డుతొలగించారు. బల్బన్ ఒకప్పుడు ఇల్టుట్మిష్ కి వేశ్యా బానిస. వీడు ఆనాటి మొఘలులలోకెల్లా అత్యంత కిరాతకమైన కామపిశాచి.

బల్బన్ విషమిచ్చి నసీరుద్దీన్ని చంపి చక్రవర్తి అయ్యాడు. తరువాత 1270 లో అతని దాయాది షేర్ ఖాన్ సికార్ ను చంపాడు. కే ఖుస్రో ని 1287 లో బల్బన్ తన వారసుడిగా ఎన్నుకున్నాడు కాని తన మరణం తరువాత ఖైఖాబాద్ చక్రవర్తి అయ్యాడు.

సైన్యాధ్యక్షుడు జలాలుద్దీన్ ఖిల్జీ ఖైఖాబాద్ ని, అతని మూడేళ్ల కుమారుణ్ణి చంపేయడంతో బానిసల వంశం అంతరించి ఖిల్జీ వంశం ప్రారంభమైంది.

## ఖిల్జీ వంశం

స్వంత వారినీ, చుట్టాలనీ, అనుచరులనీ చంపుకోని ఇస్లామిక్ పాలకుల తరం ఒక్కటికూడ లేదు.

అత్యంత దుర్మార్గుడిగా పేరున్న అల్లాఉద్దీన్ ఖిల్జీ జలాలుద్దీన్ ఖిల్జీకి మేనల్లుడు, అల్లుడు కూడ. 1296 లో మామని చంపి అతని తల నరికి బల్లానికి గుచ్చి అది పట్టుకుని ఢిల్లీలోకి అడుగు పెట్టాడు అల్లాఉద్దీన్ ఖిల్జీ. అప్పటికే జలాలుద్దీన్ భార్య మాలిక్ జహాన్ తన కొడుకుని చక్రవర్తిని చేసింది. మాలిక్ జహాన్ని, ఆమె పిల్లల్ని, చుట్టాలని అందరిని అల్లాఉద్దీన్ బంధించి గుడ్డివాళ్లని చేయించాడు. జలాలుద్దీన్ అనుచరులందరినీ చంపించడం, గుడ్డివారిని చేయడం, లేదా ఖైదు చేయడం చేశాడు. వాళ్ల ఆస్తిపాస్తులన్నీ లాగేసుకుని, వారి స్త్రీలని చెరపట్టి తన అంతఃపురానికి తీసుకెళ్లిపోయాడు. ఖిల్జీ ఎంతటి కౄరుడంటే తన స్వంత భార్యని, ఒక కొడుకుని కూడ ఖైదు చేయించాడు. ఇంకొక కొడుకుని చంపేశాడు.

అల్లాఉద్దీన్ దగ్గర అతనికి అత్యంత ఇష్టుడైన మాలిక్ కఫుర్ అనే ఒక మగ వేశ్యాబానిస ఉండేవాడు. ఇతను కూడ హిందువునుండి ముస్లింగా మార్చబడినవాడే. అల్లాఉద్దీన్ చనిపోయిన వెంటనే అతని సంతానంలో అందరినీ చంపించేశాడు మాలిక్ కఫుర్. కాని అల్లాఉద్దీన్ కొడుకుల్లో ఒకడైన ముబారక్ షా మాత్రం మాలిక్ చేతులనుండి తప్పించుకొని మాలిక్ నే హతమార్చాడు. అలాగే తన ఆరేళ్ల తమ్ముడు షియాబుద్దీన్ ను గుడ్డివాడిని చేసి తరువాత చంపేశాడు ముబారక్ షా.

ముబారక్ షా తన పేరును ఖుతుబుద్దీన్ గా మార్చుకుని సుల్తాన్ అయ్యాడు. ఇతను మొఘల్ సుల్తానులందరిలోకి సిగ్గుమాలినవాడు. తన మందిరంలో అంతటా పూర్తి నగ్నంగా ఉన్న ఆడ బానిసలని ఉంచుకుని బహిరంగంగా ఎంతో అసభ్యంగా ప్రవర్తించేవాడు. తను కూడ స్త్రీగా వేషం వేసుకుని అత్యంత జుగుప్సాకరమైన పనులు చేసేవాడు. తన సోదరుడు ఖిజ్ర్ ఖాన్ ని చంపి అతని భార్య దేవల్ ని పెళ్లి చేసుకున్నాడు. తనపై తిరుగుబాటు జరగకూడదని అతను తన బంధువులందరినీ గుడ్డివాళ్లుగా చేయడంకానీ, చంపడంగానీ చేశాడు. ఖుతుబుద్దీన్ కి ఒక-

ప్పటి వేశ్య, నమ్మకస్థుడైన సైనికాధికారి అయిన ఖుస్రో చేతిలోనే హత-మయ్యాడు ఖుతుబుద్దీన్. అతన్ని చంపిన తరువాత ఖుస్రో మళ్లీ దేవల్ ని పెళ్లి చేసుకున్నాడు.

కానీ వెంటనే ఖుస్రోని ఇంకొక బానిస ఘియాసుద్దీన్ తుగ్లక్ చంపేయడం-తో ఖిల్జి వంశం నశించి తుగ్లక్ వంశం మొదలయింది.

## తుగ్లక్ వంశం

స్వంత వారినీ, చుట్టాలనీ, అనుచరులనీ చంపుకోని ఇస్లామిక్ పాలకుల తరం ఒక్కటికూడ లేదు.

ఇప్పుడు ఘియాసుద్దీన్ని చంపడానికి అతని కొడుకుల మధ్య పోటీ మొదలయింది. ఎంతైనా ఇస్లాంని 'కాపాడే' వీళ్లకు స్వంత వారిని చంపు-కోవడం ఆనవాయితీ కద!

ఈపోటీలో ముహమ్మద్ బిన్ తుగ్లక్ గెలిచాడు. తండ్రిని చంపడంతో ఆగక తన తోబుట్టువులనందరినీ కూడ చంపేసి తనే సుల్తాన్ అయ్యాడు తుగ్లక్.

తనపైన తిరుగుబాటు జరగకుండా ముందు జాగ్రత్తగా ముహమ్మద్ బిన్ తుగ్లక్ తన బంధువులందరినీ అతి కిరాతకంగా చంపాడు. తన మేనల్లుడి చర్మం వొలిపించి అతని భార్యలతోనే బలవంతంగా తినిపించాడు.

నపుంసకుడైన ముహమ్మద్ చనిపోయినతరువాత ఘియాసుద్దీన్ తండ్రకి అక్రమ సంతానమైన ఫిరోజ్ షా అధికారాన్ని చేజిక్కించుకు-న్నాడు. తనకు ఎదురు తిరుగుతారనుకున్న అందరినీ అతి కిరాతకంగా చంపేసాడు. ఆఖరికి 80 ఏళ్ల ఖ్వాజా జహాన్ ని కూడ, అదీ నమాజు చేసుకుంటుండగా చంపేసాడు. అతను ఎప్పుడూ అంతఃపురానికే అంకి-తమయిపోవడం వల్ల రాజ్యం పూర్తిగా నాశనమయింది.

ఫిరోజ్ షా కొడుకు ముఖ్యమంత్రిని చంపేసాడు కానీ అధికారాన్ని మాత్రం చేజిక్కించుకోలేకపోయాడు. ఫిరోజ్ షా చనిపోయిన తరువాత అతని మనుమడు ఒక ఐదు నెలలు రాజ్యాన్నేలాడు. కానీ అతన్ని ఫిరోజ్ షా కి మరొక కొడుకు అయిన ముహమ్మద్ ఓడించి చంపి తను రాజయ్యాడు.

మరో నాలుగు సంవత్సరాలకి ముహమ్మద్ చనిపోవడంతో అతని కొడుకు సికందర్ గద్దెనెక్కాడు కానీ కొద్ది రోజులకే అతనుకూడ హత్యకి

గురయ్యాడు. ఫిరోజ్ షా మరొక కొడుకు నుస్రత్ ఢిల్లిలోని మరో ప్రాంతం నుండి సమాంతర ప్రభుత్వాన్ని నడిపేవాడు. ఈ నాటకం ఒక నాలుగేళ్ల పాటు కొనసాగింది. ఇంకొక నర రూప రాక్షసుడు తైమూర్ లంగ్ భారత్ పై దండెత్తడంతో ఈ శకం ముగిసింది. తైమూర్ కూడ బాబర్ అనే మరో నరహంతకుడి వంశస్థుడే.

## తైమూర్ వంశం

స్వంత వారినీ, చుట్టాలనీ, అనుచరులనీ చంపుకోని ఇస్లామిక్ పాలకుల తరం ఒక్కటికూడ లేదు.

తైమూర్ కూడ అధికారం కోసం బంధువులని అతి కిరాతకంగా చంపినవాడే. జామ మస్జిద్ తన హయాం కంటే ముందునుండి ఉందని, హిందువులక్కడ పూజించుకునేవారని తన జ్ఞాపకాల్లో వ్రాసుకున్నాడు తైమూర్. దీన్ని బట్టి జామ మస్జిద్ కూడ షాజహాన్ అనే కసాయి వాడి పేరున జమకట్టిన ఒక హిందు దేవాలయమేనని మనకర్థమవుతుంది.

తైమూర్ భారత్ పై దాడి చేసినప్పుడు ఢిల్లీ సుల్తానులిద్దరూ పరారయ్యారు. తైమూర్ చనిపోయినప్పుడు అతని కొడుకులందరూ కూడా ఇస్లామిక్ రాజులకు తరతరాలుగా వస్తున్న ఆనవాయితీకి కట్టుబడి ఒకరినొకరు చంపుకున్నారు. వారిలో బ్రతికి బట్ట కట్టిన వాడొకడు రాజయ్యాడు. ఈ పరంపర తైమూరిద్ వంశస్థులందరు కొనసాగించారు.

## సయ్యిద్ వంశం

స్వంత వారినీ, చుట్టాలనీ, అనుచరులనీ చంపుకోని ఇస్లామిక్ పాలకుల తరం ఒక్కటికూడ లేదు.

తైమూర్ భారత్ ని అతలాకుతలం చేసి వెళ్లిపోయిన తరువాత ఢిల్లీ సుల్తానులిద్దరూ తిరిగి వచ్చారు. కానీ వారిలో ఒకడు మరొకడిని చంపేసాడు. అప్పటికి ఢిల్లీ పాలన కేవలం రాజధాని వరకే, అంటే కేవలం కొద్ది కిలోమీటర్ల పరిధి వరకే, పరిమితమయిపోయింది. అధికారం కోల్పోయిన సుల్తాను చివరికి 1413 లో చనిపోయాడు. అతని మంత్రి మరొక సంవత్సరం పాటు రాజ్యాన్నేలాడు.

కానీ భారత దేశాన్ని లూటీ చేయడానికి తైమూర్ లంగ్ తో చేతులు

కలిపిన ఖిజ్ర్ ఖాన్ మంత్రిని బంధించాడు. ఈ ఉగ్రవాది తను మహమ్మద్ ప్రవక్త వంశీకుడినని చెప్పుకుంటూ సయ్యిద్ వంశాన్ని మొదలుపెట్టాడు. అందుకే ఈ వంశం సోమాలియన్ సముద్ర దొంగల (పైరేట్ల) వంటిది.

ఖిజ్ర్ ఖాన్ తరువాత అధికారంలోకి వచ్చిన ముబారక్ షా ఇస్లామిక్ ఉగ్రవాదాన్ని కొనసాగించాడు. కానీ అతను కూడ హత్య చేయబడ్డాడు. అతని తర్వాత అధికారంలోకి వచ్చిన ముహమ్మద్ షా ఒక పదేళ్లపాటు పాలన సాగించాడు. కానీ అతని సైన్యాధ్యక్షుడు బహ్లోల్ లోధి అతన్ని చంపేసాడు.

## లోధి వంశం

స్వంత వారినీ, చుట్టాలనీ, అనుచరులనీ చంపుకోని ఇస్లామిక్ పాలకుల తరం ఒక్కటికూడ లేదు.

బహ్లోల్ లోధి చనిపోయినతరువాత అతని కొడుకులు, తమ్ముడి మధ్య ముష్టి యుద్ధం మొదలయింది. ఆఖరికి అతని మూడవ కొడుకు నిజాం ఖాన్ మిగతావారిని ఓడించి సికందర్ లోధి అనే బిరుదు సంపాదించి రాజయ్యాడు.

సికందర్ లోధి గొంతు క్యాన్సర్ తో చనిపోయిన తరువాత ఇబ్రహీం లోధికి అధికారం వచ్చింది. దీనికోసం అతను సోదరుడు జలాల్ ఖాన్ ని, మామ అజాం ఖాన్ ని, దాయాది ఫతాహ్ ఖాన్ ని 'ఓడించాల్సి' వచ్చింది. జలాల్ హత్య చేయబడ్డాడు, మిగతా ఇద్దరు ఖైదు చేయబడ్డారు. కానీ అజం కొడుకు ఇస్లాం ఖాన్ తిరగబడడంతో పెద్ద యుద్ధం జరిగింది. చివరికి అజం, అతని కొడుకు ఇస్లాం ఇద్దరూ హతమయ్యారు. చివరికి బాబర్ ఇబ్రహీం లోధి తల నరికి ముల్తాన్ కి పంపించాడు. ఇబ్రహీంని చంపడానికి అతని బంధువులే బాబర్ ని ఆహ్వానించారు. అక్కడితో లోధి వంశం కనుమరుగై మొఘుల్ వంశం మొదలయింది.

## మొఘుల్ వంశం

స్వంత వారినీ, చుట్టాలనీ, అనుచరులనీ చంపుకోని ఇస్లామిక్ పాలకుల తరం ఒక్కటికూడ లేదు.

బాబర్ అంత దుష్టుడు చరిత్రలో మరొకడుండడు. తైమూర్, ఛెంఘీజ్

ఖాన్ ల వారసుడైన బాబర్ అత్యంత వికృత స్వభావం కలవాడు. కౄరత్వంలో అతన్ని మించిన వాడు మరొకడుండడు, అక్బర్ తప్ప. ఖిజ్ర్ ఖాన్ ని తన పూర్వీకుడైన తైమూరే రాజుగా నియమించాడు కాబట్టి భారత్ ను పరిపాలించడానికి తనే అర్హుడినని బాబర్ భావించాడు. అతని మామలు, బాబాయిలు అతన్ని ఫెర్గనా నుండి తరిమేయడంతో భారత్ కి వచ్చి ఇక్కడ మారణకాండ సృష్టించాడు.

బాబర్ తన బావ మరిది మెహ్ది ఖ్వాజ ని తన వారసుడిగా ఎన్నుకున్నాడు. తన రాజ్యాన్ని కొడుకులు కమ్రాన్, అక్సరీ, హిదాల్, హుమయున్ ల మధ్య పంచాడు కానీ అతను చనిపోయిన తరువాత హుమయూన్ ఎదురు తిరిగి రాజ్యాన్ని కూల్చాడు.

కన్నౌజ్ యుద్ధంలో ఓడిన హుమయూన్ తన సవతి తమ్ముళ్లు కమ్రాన్, అక్సరి లు పాలిస్తున్న లాహోర్ కి పారిపోయాడు. కానీ అప్పటికే చితికిపోయిన తన అన్న హుమయూన్ ని కాదని అతని శత్రువు షేర్ షా కి తన మద్దతు తెలిపారు వాళ్లు.

అప్పుడు హుమయూన్ పర్షియాకి పారిపోయాడు. హుమయూన్ ని తనకు అప్పగిస్తే అతనికి కాంధహార్ ఇస్తానని పర్షియా రాజుకి బేరం పెట్టాడు కమ్రాన్. హుమయూన్ కి, కమ్రాన్ కి భీకర యుద్ధం జరిగింది. చివరికి హుమయూన్ కమ్రాన్ ని ఓడించాడు. షేర్ షా కొడుకు ఇస్లాం షా. అతను కమ్రాన్ ని బంధించి హుమయూన్ కి అప్పగించాడు. 'దయామయుడైన' హుమయూన్ తనే స్వయంగా బాకుతో కమ్రాన్ కనుగుడ్లను పొడిచి ఆ గాయాలకు ఉప్పు, నిమ్మకాయ రుద్దాడు. తరువాత అతన్ని హజ్ కి పారదోలాడు. అక్కడ కమ్రాన్ దిక్కులేని చావు చచ్చాడు.

బాబర్ ఇంకొక కొడుకు అస్కరి కూడ బంధింపబడ్డాడు. తరువాత ఇద్దరూ హత్యకు గురయ్యారు. హుమయూన్ తన కొడుకుని తన తమ్ముడి కూతురికిచ్చి పెళ్లి చేశాడు.

హుమయూన్ ని ఓడించిన షేర్ షా సూరి అనే మరో కసాయి భారత్ ని అయిదేళ్లపాటు పాలించాడు. షేర్ షా సూరి ఒక బాంబు పేలుడులో చనిపోగా అతని రెండవకొడుకు ఇస్లాం షా సూరి సింహాసనాన్ని దక్కించుకున్నాడు. పెద్ద కొడుకు ఆదిల్ ఖాన్ కూడ అధికారం కోసం పోటీ పడ్డాడు కానీ ఇస్లాం షా అతన్ని చంపేసాడు.

ఇస్లాం షా ఒక 'మూత్ర సంబంధ' వ్యాధితో చనిపోయాడు. అప్పుడు అతని పన్నెండేళ్ల కొడుకు ఫిరోజ్ షా కి అధికారం దక్కింది. కానీ అతని పెదనాన్న ఆదిల్ ఖాన్ అతన్ని మట్టుబెట్టాడు.

ముహమద్ ఆదిల్ షా అధికారం కోసం తన బావలు ఇబ్రహీం ఖాన్, అహ్మద్ ఖాన్ లతో యుద్ధం చేయాల్సివచ్చింది. దాన్ని అదనుగా తీసుకున్న ఆదిల్ షా సైన్యాధ్యక్షుడు జిత్తులమారి హేము మిగతా ముగ్గురినీ చంపి ఢిల్లీని తను కైవసం చేసుకున్నాడు.

సూరి వంశంలో గొడవల్ని అవకాశంగా తీసుకున్న హుమయూన్ ఢిల్లీపై మరో సారి దాడి చేశాడు. కానీ తరువాత ఒక ఏడాదికే మద్యం తాగిన మత్తులో మెట్లపైనుండి జారిపడి చనిపోయాడు.

అప్పుడు హుమయూన్ పదమూడేళ్ల కుమారుడు అక్బర్ కి రాజ్యాధికారం సంక్రమించింది. సైన్యాధ్యక్షుడు బైరం ఖాన్ అతనికి సహాయంగా ఉన్నాడు. పానీపట్ యుద్ధంలో బైరం ఖాన్ కి అదృష్టవశాత్తు హేము పై విజయం దక్కింది. మూర్ఛపోయున్న హేముని తన విజయ చిహ్నంగా కడతేర్చి ఘాజీ అయ్యాడు అక్బర్.

కానీ కొంత కాలానికే బైరం ఖాన్ ని మక్కాకి పారద్రోలిన అక్బర్ అతన్ని మార్గ మధ్యంలోనే చంపించేసాడు. తరువాత తల్లి సమానురాలు అయిన బైరం ఖాన్ భార్యను తను వివాహం చేసుకున్నాడు. తన దాయాదులను కూడ అతి కిరాతకంగా హింసించి చంపేసాడు అక్బర్.

ఈ హత్యాకాండ అక్బర్ పాలన చివరివరకు కొనసాగింది. డక్కన్ ప్రాంతంలో అక్బర్ మకాం వేసి ఉన్నప్పుడు అతనిపైన తిరుగుబాటు జరిగింది. తన సింహాసనం కోసం తన కొడుకు జహంగీర్ సైన్యాన్ని తీసుకుని ఆగ్రా పై దండెత్తి వెళ్లాడని తెలుసుకున్న అక్బర్ డక్కన్ వదిలి సరయిన సమయంలో ఆగ్రా చేరుకుని తన అధికారాన్ని కాపాడుకున్నాడు.

అక్బర్ కొడుకు సలీం (ఇతనే జహంగీర్) తండ్రిపైన రెండు సార్లు విషప్రయోగం చేసాడు. బహుశా జోధా తో ఎవరు పడుకోవాలనే విషయంలో గొడవ జరిగుండవచ్చు! (ఈ జోధా అంటే మన వామపక్ష చరిత్రకారులకి, బాలీవుడ్ దర్శకులకి, కాల్పనిక కథకులకీ వల్లమాలిన అభిమానం). ఎందుకంటే, జహంగీరే తన వారసుడని అక్బర్ అప్పటికే ప్రకటించేయ-

డం, జోధాని నిజానికి వీళ్లిద్దరిలో ఎవరు పెళ్లి చేసుకున్నారో చరిత్రకారులు ఇదమిద్ధంగా తేల్చుకేలేకపోవడం వల్ల విషప్రయోగానికి మరే కారణాలూ కనిపించడం లేదు.

చివరికి అక్బర్ విషప్రయోగానికే బలయ్యాడు. జహంగీర్ అప్పటికే అలహాబాద్ కేంద్రంగా సమాంతర ప్రభుత్వాన్ని నడుపడమే కాకుండా విడిగా వేరే నాణాల వ్యవస్థ ఏర్పరుచుకున్నాడు. అతను భారీ సైన్యంతో వచ్చి అక్బర్ నవరత్నాల్లో ఒకడైన అబుల్ ఫజల్ ని చంపేసాడు.

అక్బర్ మరణం తరువాత జహంగీర్ చక్రవర్తి అయ్యాడు కానీ అతని పెద్ద కొడుకు ఖుస్రో అతని పై తిరుగుబాటు చేసాడు. ఖుస్రోని బంధించిన జహంగీర్ అతని కనుగుడ్లు పీకించి గృహ నిర్బంధంలో ఉంచాడు.

మాన్ సింగ్ మన దేశంలో పుట్టిన ద్రోహుల్లోకెల్లా పెద్ద ద్రోహి. అటువంటి వాని చెల్లెలు, జహంగీర్ భార్య అయిన మాన్ బాయి ని కూడ చంపించాడు జహంగీర్. ఖుస్రోని సమర్థిస్తున్నాడనే నెపంతో హిందువుల రక్షకుడు, వీరుడు అయిన గురు అర్జున్ దేవ్ ని అతి కిరాతకంగా హింసించి చంపాడు జహంగీర్.

మిర్జ బేగ్ ని చంపి అతని భార్యని తన అంతఃపురంలో బంధించిన నీచుడు జహంగీర్. ఆమే నూర్జహాన్. నూర్జహాన్ మేనకోడల్ని తన కొడుకు ఖుర్రం(షాజహాన్) కిచ్చి పెళ్లిచేసాడు. నూర్జహాన్ కి మొదటి భర్త వల్ల కలిగిన కూతుర్ని షాజహాన్ తమ్ముడు షర్యార్ కిచ్చి పెళ్లిచేసాడు. దీంతో తరువాతి చక్రవర్తి ఎవరవ్వాలనే కీచులాట మళ్లీ మొదలయింది.

జహంగీర్ ఎప్పుడూ వ్యసనాలకు బానిసై ఉండడంతో నూర్జహాన్ పెత్తనం చెలాయించేది. ఆమె మొదట షాజహాన్ని సమర్థించింది, కానీ తరువాత షర్యార్ కు వత్తాసు పలకడంతో షాజహాన్ ఎదురు తిరిగి మూడేళ్ల వ్యవధిలో కుటుంబంలో చాలా మందిని చంపేసాడు. చివరికి జహంగీర్ మద్యం మత్తులోనే చనిపోయాడు.

దీంతో మళ్లీ కుమ్ములాట మొదలయింది. షాజహాన్ ఢిల్లీలో లేనప్పుడు చూసి నూర్జహాన్ తన తమ్ముడు అసఫ్ ఖాన్ ని అపహరించింది. అతని నేరం షాజహాన్ కు విధేయుడిగా ఉండడమే.

అప్పటికే షాజహాన్ తన గుడ్డి అన్నను విషమిచ్చి చంపాడు. అసఫ్ ఖాన్

తన కొడుకుని చక్రవర్తిని చేసాడు. షర్యారే చక్రవర్తి అని నూర్జహాన్ ప్రకటించింది. దీంతో యుద్ధం మళ్ళీ మొదలయింది. ఈ యుద్ధంలో షర్యార్ పట్టుబడ్డాడు. అతన్ని గుడ్డివాడిని చేసేసారు.

ఇదిలా ఉండగా షాజహాన్ తిరిగివచ్చాడు. అతను రావడమే చక్రవర్తులుగా ప్రకటించుకున్న వారినీ, రాకుమారులందరినీ, వాళ్ల కుటుంబాలతో సహా చంపేసాడు. వీడు ఎంతటి కిరాతకుడంటే వీడి కామానికి స్వంత కూతురు కూడ బలయ్యింది. తోటలోని పండును మొదటిగా తినే హక్కు తోటమాలికే ఉంటుందని చెప్పేవాడు.

మూర్ఖులైన చరిత్రకారులు తాజ్ మహల్ ని షాజహాన్ కట్టించాడని చెప్తారు. కానీ నిజానికి బాబర్ కూడ తాజ్ మహల్లో బస చేసాడని బాబర్నామలో ఉంది. ఈ రాక్షసులు, కసాయిలు శిల్పులంటే నమ్మేదెవరు?

షాజహాన్ ముసలివాడయ్యాక అతని అంతఃపురం నుండి పుట్టుకొచ్చిన దండు (అతని వికృత చేష్టల వల్ల పుట్టుకొచ్చిన సంతానం) మధ్య అధికారం కోసం అంతర్యుద్ధం మొదలయింది. వీళ్లందరిపైన ఔరంగజేబ్ విజయం సాధించి తన అన్నదమ్ములు దారా, షుజాహ్, మురాద్ లని చంపేసాడు. తరువాత షాజహాన్ని ఖైదు చేసి తరతరాలుగా వస్తున్న ముస్లిం న్యాయాన్ని అతనికి రుచిచూపించాడు.

మొఘల్ చక్రవర్తుల్లోకెల్లా అత్యంత నీచునిగా పేరున్న ఔరంగజేబు తన కుటుంబ సభ్యులని హింసించడంలో ఆరితేరినవాడు. ఔరంగజేబ్ తన అన్న దారా సికోహ్ ని చంపడం, తండ్రి షాజహాన్ ని దేశం నుండి తరిమేయడం వంటి చర్యలతో అపకీర్తిని మూటగట్టుకున్నాడు. కానీ అతను కొత్తగా చేసిన చెడు ఏమీలేదు. ఇటువంటివన్నీ తన తండ్రి షాజహాన్నుండి నేర్చుకున్నవే. షాజహాన్ తన తండ్రి జహంగీర్ నుండి, జహంగీర్ తన తండ్రి అక్బర్ నుండి, అక్బర్ తన తండ్రి హుమయూన్ నుండి తరతరాలుగా నేర్చుకుని ప్రయోగిస్తూ వస్తున్నవే ఇవన్నీ.

ఔరంగజేబ్ కి కూడ అదే గతి పట్టింది. అతని కొడుకు అక్బర్ అతనిపై తిరుగుబాటు చేసి తననుతాను రాజుగా ప్రకటించుకున్నాడు. కానీ ఔరంగజేబు తన కొడుకు అక్బర్ని ఓడించేసాడు. దాంతో అక్బర్ ఇరాన్ కి పారిపోయాడు. గురుగోబింద్ సింగ్, బంద బైరాగి, శివాజి, ఛాత్రసాల్ వంటి వీరుల దయవల్ల ఔరంగజేబ్ చనిపోయాడు. ఆ తరువాత మళ్ళీ అతని

కొడుకుల మధ్య ఆధిపత్య పోరు చెలరేగింది. అప్పుడు బహదూర్ షా తన సోదరులని చంపి తను చక్రవర్తి అయ్యాడు.

బహదూర్ షా చనిపోయిన తరువాత అతని నలుగురు కొడుకులు కుమ్ములాడుకున్నారు. ఈ చతుష్ముఖ పోరులో జహందర్ షా గెలిచి మిగతావారిని చంపేసాడు.

ఇదిలా ఉంటే జహందర్ మేనల్లుడు ఫరూఖ్ సియార్ కూడ తన రాజరికాన్ని ప్రకటించుకున్నాడు. అనధికారిక పాలకులైన సయీద్ సోదరుల సాయంతో జహందర్ ను ఓడించి చంపేసాడు ఫరూఖ్.

చక్రవర్తి అయిన ఫరూఖ్ సయీద్ సోదరుల కబంధ హస్తాలనుండి తప్పించుకోవాలని చూసాడు కానీ వాళ్లు అతన్ని బంధించి గుడ్డివాణ్ణి చేశారు. ఆ తరువాత అతన్ని గొంతు నులిమి చంపారు.

రంగీలా హయాంలో నాదిర్ షా భారత్ పైకి దండెత్తాడు. ఇరాన్ రాజు షా చిన్న కుమారుడు అబ్బాస్ ని చంపి నాదిర్ షా చక్రవర్తి అయ్యాడు. 1743 లో తన స్వంత కొడుకు కళ్లు పీకించేసాడు నాదిర్ షా. వీడు షియాలకీ, విగ్రహారాధకులకీ కూడ శత్రువే. ఆఖరికి తన మేనల్లుడు అలీ కులీ ఖాన్ చేతిలో హతమయ్యాడు. అతనితో పాటు అతని కొడుకులు పదమూడు మంది, అతని మనుమల కూడ హతమయ్యారు. ఒక మనుమడు మాత్రం ప్రాణాలను దక్కించుకుని ఆష్ట్రియా పారిపోయి అక్కడి రాజులకు ఊడిగం చేసాడు.

నాదిర్ షా తరువాత అతని సైన్యాధ్యక్షుడు అహ్మద్ షా అధికారాన్ని కైవసం చేసుకుని కిరాతకత్వంలో నాదిర్ షాని మించిపోయాడు. ఇతను అనేక సార్లు భారత్ పైకి దండెత్తి మొఘల్ రాజులను నిర్వీర్యులను చేసాడు. అతన్ని సిఖ్కులు చాలా వరకు అడ్డుకోగలిగారు. తరువాత వచ్చిన తైమూర్, అతని తరువాత వచ్చిన అతని కొడుకులు మళ్లీ రక్తపాతాన్ని సృష్టించారు. తైమూర్ ఐదవ కొడుకు సింహాసనాన్నెక్కాడు కానీ అతన్ని గుడ్డివాడిని చేసి అతను చనిపోయేవరకు, అంటే 40 సంవత్సరాలపాటు, ఖైదు చేసారు. మిగతా అన్నదమ్ములు వారి పిల్లలు ఒకరినొకరు చంపుకుంటూ ముక్కలైన వాళ్ల రాజ్యాలను విస్తరించుకునే ప్రయత్నాలు చేసారు.

తిరిగి మొఘలుల విషయానికొస్తే రంగీలా తరువాత అతని కొడుకు

అహ్మద్ షా నామమాత్రపు రాజయ్యాడు. చివరికి మరాఠాల చేతిలో ఓడిపోయాడు. అప్పుడు జహందర్ రెండవ కొడుకు అలంగిర్ II తన పేరున రాజ్యం స్థాపించాడు. కొత్త అలంగిర్ (వీడే ఒకప్పటి నరహంతకుడు ఔరంగజేబ్) అహ్మద్ షాని, అతని తల్లిని అధికారం చేపట్టిన వారం రోజుల్లోపే గుడ్డివారిని చేసాడు.

అలంగిర్ II ను అతని మంత్రులు 1759 లో చంపేసారు. అప్పటికి మొఘల్ పాలన అంతం కావచ్చింది. ఆ తరువాత బ్రిటీషు వాళ్లు విదిల్చిన డబ్బులతో కాలక్షేపం చేస్తూ ఒక 100 సంవత్సరాల పాటు ఎఱ్ఱకోటకు పరిమితమైపోయారు. మొఘలుల అంతఃపురం నుండి పుట్టుకొచ్చిన మరొక నీచుడు, అలంగిర్ తరువాత అధికారంలోకి వచ్చిన వాడు షాజహాన్ III. కానీ త్వరగానే ఆఫ్ఘాన్లు అతన్ని అతని అనుయాయుల్ని శాశ్వతంగా తరిమికొట్టారు. అతనేమయ్యాడో ఎవరికీ తెలియదు.

దీంతర్వాత అలంగిర్ II కొడుకు షా ఆలం II 1761 లో నామమాత్రపు చక్రవర్తి అయ్యాడు. 1788 లో అతని మంత్రి కొడుకు గులాం ఖాదిర్ చక్రవర్తిని, అతని కుటుంబాన్ని వీధుల పాల్జేసాడు. రాణులను, యువరాణులను చెరిచాడు. షా ఆలం ఛాతీపై తాను కూర్చుని అతని కళ్లను ఎలా పెకిలించింది చిత్రకారులచేత బొమ్మలు కూడ వేయించుకున్నాడు. షా ఆలం తన కుటుంబాన్ని ఇలాగే చేసాడు కాబట్టి అతనికి అదే శాస్తి జరిగిందన్నాడు గులాం ఖాదిర్.

చివరికి మరాఠాలు గులాం ఖాదిర్ని మొఘలులకి అప్పగించగా అతన్ని ప్రజల సమక్షంలో చాలా రోజులపాటు హిసించి, ముక్కలుగా నరికి చంపారు. అతని శరీరాన్ని వీధి కుక్కలు పీక్కుతిన్నాయి. గుడ్డివాడైన ఆలం షా II సానుభూతితో మళ్లి ఎఱ్ఱ కోటకి చక్రవర్తి అయ్యాడు.

1806 లో అతని మరణం తరువాత అతని కొడుకు అక్బర్ బ్రిటీషువాళ్ల సామంతుడయ్యాడు. అతని తరువాత అధికారంలోకి 62 ఏళ్ల బహదూర్ షా జఫర్ వచ్చాడు. కానీ ఈ సారి బ్రిటీషు వాళ్లు చంపేస్తారనే భయంతో ఎవరూ తిరుగుబాటు చేసే ధైర్యం చేయలేదు.

## సారాంశం మాత్రం స్పష్టం

ఇస్లాం ప్రతినిధులు తమ స్వంత తల్లిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు, పిల్లల పట్లే సానుభూతి లేకుండ, స్వంత వారికే నమ్మకద్రోహం

తలపెడితే మిగతా ముస్లింలు, ముస్లిమేతరుల పట్ల సానుభూతి కలిగి ఉంటారంటే ఎవరు నమ్ముతారు? అటువంటి దుర్మార్గులని ఆకాశానికెత్తే వికృత స్వభావులు ఉగ్రవాదం కాక మరేం చేయగలరు?

మొఘల్ వంశీయులని మనమీనాడు ప్రశ్నించాలి. మొఘలులని చరిత్రనుండి చెరిపివేయకూడదు కానీ ఈ విదేశీ పాలకుల నమ్మకద్రోహాన్ని, మూఢత్వాన్నీ, నిరంకుశత్వాన్నీ ఎండగట్టాలి. వీళ్లు చేసిన దురాగతాలు ప్రపంచానికి తెలిసేలా ప్రచారం కల్పించాలి.

# 3

# బాబర్ - ఒక మాదకద్రవ్యాల బానిస, పిల్ల-లని చెరిచే నీచుడు

ఇస్లామిక్ నిర్వచనాల ప్రకారం బాబర్ అసలు ముస్లిమే కాదు. అతను ఇప్పటి రోజుల్లో ఏదైనా ముస్లిం దేశంలో పుట్టి ఉంటే అతన్ని రాళ్లతో కొట్టి చంపేసేవారు!

బాబర్ నిజానికి ఇస్లాం కే ఓ కళంకం. బాబర్ నిజస్వరూపం తెలుసుకో-డానికి ఏ హిందు 'మతవాదుల' రచనల మీదో, 'అతివాద' చరిత్రకారుల పుస్తకాలమీదో ఆధారపడనక్కరలేదు. వాడి నోటితోనే పలికిన కూతలు చాలు. బాబరు ఆత్మకథ బాబర్ నామా అన్ని ప్రధాన భాషల్లోను అను-వదించబడింది. దాంట్లో ఏముందో చూద్దాం.

ఈ అధ్యాయం వరకు మనం ఆనెట్ సుసానా బెవెరిడ్జ్ అనువదించిన, 1922 లో అచ్చయిన అతని ఆత్మకథని చర్చించుకుందాం. బాబర్ నామా మూలకథ టర్కిష్ భాషలో వ్రాయబడింది. ఈ గ్రంథం ఎంతవరకు

అందుబాటులో ఉందో అంతవరకు తీసుకుని ఇంగ్లీషులోకి అనువదించారు ఆనెట్. బాబర్ నిజస్వరూపం తెలుసుకోడానికిది సరిపోతుంది.

## బాబర్ - ఒక తాగుబోతు, స్వలింగ సంపర్కుడు, పిల్లలను చెరిచే నీచుడు

బాబర్ ఆత్మకథ చూస్తే అతనొక స్వలింగ సంపర్కుడు, పిల్లలను చెరిచే ఒక నీచుడని స్పష్టంగా మనకర్థమవుతుంది. బాబ్రీ మసీదుని సమర్థిస్తున్న వారందరు మొదట అసలు స్వలింగ సంపర్కం, పిల్లలను చెరచడం ఇస్లాంలో సమ్మతమేనా అనే ప్రశ్నకి సమాధానం చెప్పాలి. ఒకవేళ వారి సమాధానం 'కాదు' అయితే బాబర్ ఇస్లాంకే ఒక మాయని మచ్చ. అలాగే అతను కట్టించిన కట్టడం కూడ ఇస్లాంకి అవమానకరమైనదే.

తన ఆత్మకథ పేజి నంబరు 120-121 లలో బాబర్ తనకు తన భార్యపై పెద్దగా ప్రేమ లేదని, బాబ్రీ అనే పిల్లవాడంటే మాత్రం పిచ్చి అని చెప్తాడు. అతన్ని ప్రేమించినంత పిచ్చిగా మరెవర్నీ ప్రేమించలేదని ఒప్పుకుంటాడు. అతని మీద ప్రేమగీతాలు వ్రాసేవాడు బాబర్. ఉదాహరణకి, "నా అంత సిగ్గుపడిన, విరహాన్ని అనుభవించిన గాఢ ప్రేమికుడు మరొకడుండడు, అలాగే నా ప్రేమికుడంత కౄరుడు, దౌర్భాగ్యుడు మరొకడుండడు "

తన ప్రేమికుడు తన దగ్గరగా వస్తే తన ఒళ్లు పులకరిస్తుందని, తన నోట మాట పడిపోతుందని చెప్తాడు. ప్రేమ మైకంలో జోగిపోతుండడంతో తన ప్రేమికుడు చూపించే ప్రేమకి కృతజ్ఞత కూడ తెల్పలేకపోతున్నానంటాడు.

బాబర్ ఒకసారి స్నేహితులతో విహరిస్తుండగా బాబ్రి ఎదురుపడ్డాడు. బాబర్ పులకించిపోయి మాటల సంగతటుంచి బాబ్రిని చూడడానికి కూడ సిగ్గుపడిపోయాడు. "నా ప్రేమికుడిని చూసి నేనెంతో సిగ్గుపడిపోయాను. నా స్నేహితులు నన్ను కాంక్షిస్తే నేను మరొకరిని కాంక్షిస్తాను" అని వ్రాసుకున్నాడు.

తన యుక్త వయసు కోర్కెలతో నగ్నత్వం తప్ప మరేదీ కానకుండా ఉండేవాడినని ఒప్పుకుంటాడు బాబర్.

"నన్ను ప్రేమ మైకం కమ్మేసేది. ప్రేమికులు ఇటువంటి పరిస్థితులను ఎదుర్కోవలసి వస్తుందని నేనెన్నడు అనుకోలేదు. నిన్ను విడిచి దూరంగానూ పోలేకపోతున్నాను, అలాగని నీ దగ్గరగానూ ఉండిపో-

లేకపోతున్నాను. ఓ చెలికాడా, నీ ప్రేమతో నన్ను పూర్తిగా వివశుడిని చేసేసావు" అని వ్రాస్తాడు.

ఇవన్నీ చదివితే కొన్ని విషయాలు స్పష్టంగా అర్థమవుతాయి -

- బాబరు, అతని అనుచరులూ స్వలింగ సంపర్కులని, పిల్లలను చెరిచేవారని.
- ఇస్లామిక్ షరియత్ ప్రకారం అటువంటి పనులకి రాళ్లతో కొట్టి చంపడమే శిక్ష అని.
- బాబర్ కట్టించిన బాబ్రి మసీదు తన చెలికాడు బాబ్రి పేరునే అని

ఇలాంటి తుచ్ఛులు కట్టించిన కట్టడాలు ఇస్లాం ప్రకారం స్మారక చిహ్నాలవుతాయా లేక అవమానానికి నిదర్శనాలవుతాయా?

## బాబర్ - ఆటవికుడు, దోపిడీదారుడు, తాగుబోతు, మాదకద్రవ్యాలకు బానిస, కామపిశాచి

(బాబర్ ఆత్మకథ అత్యంత కౄరంగా, అసభ్యకరంగా, జుగుప్సాకరంగా ఉంటుంది. దీన్ని పూర్తిగా చదవాలంటే మీకు అసహ్యం వేస్తుంది. అందుకని ఇక్కడ కొన్ని ఉదాహరణలు మాత్రమే వ్రాశాను)

- పేజి 232: సంధి కోసం వచ్చిన అమాయకులైన ఆఫ్ఘానుల తలలునరికి వాళ్ల తలలను గుట్టలా పేర్చానని వ్రాశాడు. హంగు లో కూడ ఇదే ఘోరానికి పాల్పడ్డాడు. అక్కడ 200 మంది ఆఫ్ఘానుల తలలు నరికి గుట్టగా పోశాడు.
- పేజి 370: ఇస్లాం ని నమ్మని కారణంగా బజౌర్ లో 3,000 మందిని చంపి, వాళ్ల భార్యా పిల్లలని బందీలుగా పట్టుకుపోయాడు.
- పేజి 371: బందీలుగా పట్టుకున్న చాలా మంది తలలు నరికి కాబుల్, బాల్ఖ్ మొదలైన ప్రాంతాలకు పంపించి విజయ దండోర వేయించాడు.
- పేజి 371: నరికిన తలలను గుట్టగా పోసి విజయాన్ని సంబరంగా జరుపుకున్నాడు.

- పేజి 371: ముహర్తం రోజున పెద్ద ఎత్తున ద్రాక్ష సారాయి తో విం-దునిచ్చానని, తాము రాత్రంతా తాగుతూనే ఉన్నామని వ్రాశాడు (ఇక్కడ అనువాదకురాలు బాబర్ పచ్చి తాగుబోతు అని, అతను జీవితాంతం తాగుడుకి బానిసగా ఉన్నాడని వ్రాశారు). బాబర్నామ అంతా ఈ మద్యం విందుల విశేషాలతో నిండి ఉంటుంది.
- పేజి 373: తానొకప్పుడు పెద్ద ఎత్తున మాదకద్రవ్యాలు తీసుకో-వడంతో ఒక రోజు నమాజుకి వెళ్లలేకపోయానని వ్రాశాడు. అదే మోతాదులో తీసుకుంటే అప్పటి మత్తులో సగం కూడ ఈ రోజు తనకెక్కదని వ్రాశాడు.
- పేజి 374: బాబర్ తన వేశ్యావాటికల్లోని స్త్రీల ద్వారా అనేక మంది సంతానాన్ని కన్నాడు. తన మెదటి భార్య సంతానం ఎవరూ బ్ర-తకకపోవడం వల్ల తను అక్రమ సంతానం ఎంత మందిని కన్నా తన భార్య వారిని సాకుతానందని వ్రాశాడు. ఇది చదివితే బాబర్ వేశ్యావాటికలు నేటి కోళ్ల ఫారాలని తలపిస్తాయి.
- పేజి 385-388: తన కొడుకు హుమయూన్ పుట్టడం తనకెంతో ఆనందాన్నిచ్చిందని, హుమయూన్ పుట్టిన రోజు రాత్రి తాను, తన స్నేహితులు పడవపై షికారుకు వెళ్లి రాత్రంతా మద్యం తాగి, మాదకద్రవ్యాలు తీసుకుని ఆనందించామని వ్రాశాడు. అందరికీ మత్తెక్కడంతో గలాటా మెదలయిందనీ, అప్పుడు ఎటువాళ్లటు వె-ళ్లిపోయారని వ్రాశాడు. అటువంటిదే ఇంకొక సందర్భంలో మద్యం ఎక్కువై తాను వాంతులు చేసుకున్నానని, మరుసటి రోజు ఉద-యానికి తనకేమీ గుర్తులేకుండా పోయిందని వ్రాసుకున్నాడు.
- పేజి 527: ఒక రోజు స్తంభాలు, వాకిలి ఉన్న ఒక పాడుబడిన కట్ట-డంలో (తాజ్ మహల్ ని ఉటంకిస్తు) విందు ఏర్పాటు చేసానని వ్రాశాడు. కానీ మన చరిత్రకారులు తాజ్ మహల్ కట్టించిన గొప్ప-దనాన్ని షాజహాన్ కి ఆపాదిస్తారు.

ఇలా అతని ఆత్మకథలో ఏ భాగాన్ని తీసి చూసినా తను వెళ్లినచోట-ల్లా అక్కడి వారిని తానెలా దోచుకుందీ, ఎలా భయపెట్టి బ్రతికిందీ, ఎంత కౄరంగా వాళ్లని చంపిందీ, తాను హరామ్(ఇస్లాంలో నిషిద్ధమైనది) మాంసం (పంది మాంసం) ఎలా తిన్నదీ వంటి విషయాలనే వివరిస్తాడు

బాబర్. ఇవన్నీ బాబర్ తన ఆత్మ కథలో గర్వంగా వ్రాసుకున్న విధానం చూస్తే అతను ఇటువంటి జీవితాన్ని గొప్పగా భావించాడని మనకు అర్ధ-మవుతుంది. స్వీయ శ్లాఘన తో నిండిన అతని జీవిత చరిత్రలో స్థానం దక్కని నేరాలింకెన్ని ఉండిఉంటాయో అనే ఆలోచనే మన వెన్నులోంచి వణుకు పుట్టిస్తుంది.

**సారాంశం:**

బాబర్ చేసిన నీచమైన పనులగురించి విన్నవాళ్లకెవరికైనా జుగుప్స కలుగుతుంది. అతను ఇస్లాంని ఆచరించేవాడు కానే కాదు అని ఇట్టే అర్ధమవుతుంది. ఎవరైనా మూర్ఖులు ఇస్లాం నిర్వచనం ప్రకారం బాబర్ కూడ ముస్లిమేనని వాదిస్తే ఆ ఇస్లాం నిర్వచనమంత జుగుప్సాకరమైన-ది మరొకటుండదు. బాబ్రీ మసీదు బాబర్ స్వలింగ సంపర్క వేశ్య బాబ్రి పేరుమీద కట్టించినదే.

ఇస్లాం దృష్టిలోనే నీచులు, ఉగ్రవాదులు, దోపిడీదారులూ అయిన ఈ దుష్టులకు తమకు ఎటువంటి సంబంధం ఉంచుకోకూడదు నిజమైన ముస్లింలు. వీళ్లని ముస్లింలని, తమ పూర్వీకులని అనుకోకూడదు. మన ఆదర్శమూర్తులు, పూర్వీకులూ అయిన రాముడిని, కృష్ణుడిని తమ వారిగా భావించాలి.

# 4

# అక్బర్ - ఒక గొప్ప కసాయి

భారతదేశ చరిత్రలో అతి కొద్ది మందికి 'ఘనుడు' (ఇంగ్లీషులో 'ది గ్రేట్') అనే బిరుదు దక్కింది - నాకు తెలిసినకాడికి అశోకుడు, అలెక్జాండర్, ఇంకా అక్బర్ మాత్రమే. నిజానికి 'ఘనుడు' అని పిలవాలంటే అసా-ధారణమైన గొప్పవాడై వుండాలి. ఒకరితరువాత మరొకరు గొప్పవారిని కన్నది ఈ కర్మ భూమి - రాముడు, కృష్ణుడు, విక్రమాదిత్యుడు, పృ-థ్వీరాజ్, రాణప్రతాప్, శివాజీ - ఇలా ఎందరో. కానీ మన 'చరిత్రకారుల' దృష్టిలో మాత్రం వీళ్లలో ఎవరూ 'ఘనులు' కాదు.

ఎందుకంటే వీళ్ల దృష్టిలో ఘనుడవ్వాలంటే కొన్ని ప్రత్యేక లక్షణాలుండా-లి. తన సమకాలీనుల్లోకెల్లా అత్యంత క్రూరుడైన హంతకుడయ్యుండాలి, హిందూ ధర్మంపైన ఏదో ఒక రూపంలో దాడి చేసినవాడైయ్యుండాలి!

తన రాజ్య దాహంతో లెక్కలేనంత మంది ప్రజలను చంపిన అలెక్జాండర్ ఈ కోవకి చెందిన మొట్ట మొదటి ఉగ్రవాది. పోరస్ చేతిలో చిత్తుగా ఓడిపోయి అతను కనికరించి ప్రాణాలతో వదిలితే అవమానభారంతో తిరిగివెళ్లిపో-

యినవాడు అలెక్జాండర్. కానీ మన గొప్ప చరిత్రకారుల దృష్టిలో మాత్రం ఇది పోరస్ కే ఓటమి. వీళ్లు చరిత్రకారులగాకన్నా నవలా రచయితలుగా, కవులుగానే బాగా రాణిస్తారు. నిజానికి గ్రీకు చరిత్రకారులే వీళ్లకన్నా నిజాయితీపరులు, దాపరికం లేనివాళ్లు. ప్రస్తుతానికా విషయాన్ని పక్కన పెట్టేద్దాం. కానీ, అలెక్జాండర్ లెక్కలేనంత మందిని పొట్టన పెట్టుకున్నాడు కాబట్టి మనవాళ్ల దృష్టిలో 'ఘనుడ'య్యాడనేది మాత్రం వాస్తవం.

తరువాతి వాడు అశోకుడు. చెప్పనలవిగాని మారణకాండని సృష్టించిన తరువాత ఇతగాడికి హఠాత్తుగా పశ్చాత్తాపం కలిగింది. ఇతను మన సృజనాత్మక చరిత్రకారులకి మరొక ఆదర్శనీయుడు. అతనికున్న లెక్కలేనంత మంది భార్యల్లో ఒకరితో అతను సాగించిన రాసలీలలను ఏకంగా సినిమాగానే తీసేసారు. కానీ ఒకటి మాత్రం స్పష్టం - అతని పశ్చాత్తాపానికి ముందు అతను హిందూ విలువలని పక్కకు తోసి కనీ వినీ ఎరుగనంత పెద్ద మారణహోమం సృష్టించాడు కాబట్టి అతను 'ఘనుడు' అయిపోయాడు.

అతని తరువాత చాలాకాలం వరకు అంతటి రక్తపాతాన్ని ఎవరూ సృష్టించలేకపోయారు. కానీ పశ్చిమాసియా నుండి ఇస్లాం పతాకం పట్టుకు వచ్చిన ఆటవికులు అతన్ని మరపించేలా మారణకాండని, ఉగ్రవాదాన్నీ సాగించారు. శాంతి దూత గా చెప్పుకునే మహమ్మద్ ని అభాసు పాల్జేసారు. 'ఘనుడ'వ్వడానికి శతాబ్దాలపాటు అన్ని తరాలవాళ్లూ పోటీపడ్డారు. చివరికి తల్లి వైపున తైమూర్, తండ్రి వైపున ఛెంఘిజ్ ఖాన్ వంటి కౄరుల వారసత్వం కలిగినవాడు, మొఘుల్ వంశస్థుడూ అయిన అక్బర్ ఆ బిరుదుని దక్కించుకున్నాడు.

బాబర్ ఒక కామ పిశాచి, హంతకుడు, స్వలింగసంపర్కుడు, పిల్లలను చెరిచేవాడు. అతను, మిగతా మొఘులులు అందరూ వంశపారంపర్యంగా వస్తున్న ఈ అవలక్షణాలన్నీ తు.చ. తప్పకుండ పాటించారు. ఇంతటి గొప్ప చరిత్ర ఉన్న బాబర్ కి మరో అరుదైన గౌరవం కూడ దక్కింది. అతని బొమ్మ భారతీయ పిల్లల చరిత్ర పాఠ్య పుస్తకాలమీద కూడ అచ్చయింది. అలాంటి బాబర్ మనమడైన అక్బర్ కౄరత్వంలో, ఉగ్రవాదంలో అందరి అంచనాలను మించిపోయి 'ఘనుడ'నిపించుకున్నాడు. అప్పటినుండి ఇప్పటివరకు అతన్ని మించినవాళ్లు ఎవరూ పుట్టలేదు. ఆఖరికి ఒసామా బిన్ లాడెన్ కూడ.

'ప్రముఖ' చరిత్రకారులు లౌకికవాదం ముసుగులో పడి అవిశ్వసనీయుల పుస్తకాలనాధారంగా చేసుకుని ఇటువంటి కిరాతకులని గొప్పవారిగా చిత్రించడం ఎంతో సిగ్గుచేటు. ఇటువంటి ద్రోహులుంటే ఇంక మనకి వేరే శత్రువులెందుకు! భరతమాత కడుపున అత్యత్భుతమైన దేశభక్తులతో-పాటు ఎంతో మంది దేశ ద్రోహులు కూడ పుట్టారు. ఈనాడు దేశభక్తు-లకంటే ద్రోహుల సంఖ్యే ఎక్కువగా ఉంటోంది. ఈ ద్రోహులు ఎక్కువగా పట్టి పీడిస్తున్నది మన చరిత్రనే. ఆ తరువాత వీరు ఎక్కువగా ప్రభావితం చేస్తున్నది కళలు, సంస్కృతి, వినోద మాధ్యమాలనీ.

మన బాలీవుడ్ 'తారలు' అక్బర్ ప్రవర్తనని నిర్లజ్జగా పొగడడం-లో ఎందుకంత ఉత్సాహం చూపిస్తారో, జోధా అక్బర్ లాంటి కాల్పనిక కధలను ఆత్మాభిమానం లేని మన ప్రజలెందుకు ఆదరిస్తున్నారో తె-లుసుకోడానికి ఈ అధ్యాయంలో అక్బర్ జీవితాన్ని మనం సంక్షిప్తంగా చర్చించుకుందాం. మా వాదనలేవీ అతివాద చరిత్రకారుల రచనలనాధా-రం చేసుకున్నవి కావు. అయినా మన దేశంలో అతివాదుల వాదనల-కెప్పుడూ విలువలేదు కద! అందుకని దానికి బదులుగా మనం అక్బర్ ని అతిగా ఆరాధించిన వారి రచనలనే తీసుకుని చూద్దాం. విన్సెంట్ స్మిత్ వ్రాసిన 'అక్బర్ – ఎ గ్రేట్ మొఘల్' పుస్తకం, అలాగే అక్బర్ భట్రాజు అబుల్ ఫజల్ వ్రాసిన 'అయిన్-ఎ-అక్బరి', వీటన్నిటినీ మించిన అక్బర్ ఆత్మకథ అక్బర్ నామా లు తీసుకుందాం. మనం చర్చించుకునేదల్లా ఈ భట్రాజులంతటి వారు కూడ దాచలేకపోయిన విషయాల్నే.

## అక్బర్ ది గ్రేట్ మూలాలు

"అక్బర్ విదేశీయుడు. అతని శరీరంలో ఇసుమంతైనా భారతీయ రక్తం లేదు...అక్బర్ కి మొఘల్ కంటే తుర్క్ లక్షణాలే ఎక్కువ " అంటూ తన పుస్తకాన్ని మొదలుపెట్టాడు విన్సెంట్ స్మిత్. కానీ భారతీయులమైన మనం మాత్రం అతను భారతీయుడే అని ప్రకటించేసుకుంటాం. అతని తండ్రి, తాత, ఆ మాటకొస్తే అతని పూర్వీకులందరూ తమ తమ కాలంలో భారత్ ని దోపిడీ చేయడమే లక్ష్యంగా పెట్టుకున్న దుండగులే. అక్బర్ అటు తండ్రి వైపు తైమూర్, ఇటు తల్లి వైపు ఛెంఘిజ్ ఖాన్ ల ఏడవతరం వాడు. అన్ని తరాల వారూ భారత్ ని దోచుకున్నవారే. ఇటువంటి వాడు మన భారత దేశానికే గర్వకారణమని మనం చెప్పుకుంటాం.

## అక్బర్ ది గ్రేట్ అందం, అతని రాచరికపు పోకడలు

బాబర్ ఒక తాగుబోతు. హుమయూన్ గంజాయి త్రాగి మందబుద్ధి అయ్యాడు. ఈ రెండు గొప్ప అలవాట్లనీ పుణికిపుచ్చుకున్నాడు అక్బర్. అక్బర్ కొడుకులోక ఇద్దరు మాదకద్రవ్యాలను అతిగా వాడడం వలన చనిపోయారు. అటువంటివాడిని చూసి మన ముస్లింలు గర్వపడతారు.

బాలీవుడ్ కథానాయకుడొకతను జోధా అక్బర్ లో అక్బర్ పాత్ర పోషించ-డానికి ఎంతో ఉత్సాహపడ్డాడు. చరిత్రకారులు అక్బర్ అత్యంత అందగా-డని, అతిలోక సుందరుడనీ చెప్తారు. అతని అందం ఎటువంటిదో విన్సెంట్ స్మిత్ మాటల్లో మీరే చూడండి:

“అక్బర్ ది సాధారణమైన ఎత్తు. అతను ఎడమకాలు కుంటుకుంటూ నడిచేవాడు. అతని తల కుడి భుజంపైకి వాలి ఉండేది. అతను చిన్న ముక్కుతో పొడుచుకువచ్చినట్లుండే ముక్కుదూలంతో ఉండేవాడు. అతని ముకుపుటాలు ఎప్పుడు అదురుతూ కోపంగా ఉన్నవారిని తలపించేవి. బఠానీ గింజంత పులిపిరికాయ ఒకటి అతని పెదవినలంకరించి ఉండేది. అతను నల్లని వాడు”.

అక్బర్ మత్తులో ఉన్నా, స్వాధీనంలో ఉన్నా తనని ‘షేక్’ అనే సంబోధిం-చేవాడని వ్రాసుకున్నాడు జహంగీర్. దీన్ని బట్టి అక్బర్ ఎక్కువ వరకు మత్తులో జోగుతుండేవాడని మనకి అర్థమవుతుంది.

“అక్బర్ అతిగా మద్యం తాగడం ఆరంభించాడు. ఈ త్రాగుడు వల్ల అతను అతిథులతో మాట్లాడుతూనే నిద్ర పోయేవాడు. అతను అప్పుడప్పుడు తాటి కల్లు, అప్పుడప్పుడు ‘పోస్ట్’ తాగేవాడు. అతిగా తాగిన రోజు అతను పిచ్చిగా ప్రవర్తించేవాడు” అని వ్రాశాడు అక్బర్ ఆస్థానంలోవాడైన అఖ్వా-వివ.

## అక్బర్ ది గ్రేట్ చదువు

“అక్బర్ కి చదవడం వ్రాయడం రాకపోయినా బాగా చదువుకున్న వాడి-కిమల్లే ప్రవర్తిచాలనుకునేవాడు” అని వ్రాసాడు జహంగీర్.

## అక్బర్ ది గ్రేట్ కి స్త్రీలమీద ఉండే గౌరవం

“అక్బర్ అధికారంలోకి వచ్చిన మొదట్లో కొన్ని సంవత్సరాలపాటు పరదా

చాటునే ఉండిపోయాడు" అని వ్రాస్తాడు అబుల్ ఫజల్. దాని అర్థమేంటో మీకీపాటికి తెలిసేఉంటుంది.

"అక్బర్ హరెంలో 5,000 మంది స్త్రీలుండేవారు. వాళ్లలో ప్రతి ఒక్కరి-కి ప్రత్యేకంగా ఇల్లుండేది" అని అక్బర్ అంతఃపురం గురించి వివరిస్తా-డు అబుల్ ఫజల్. 40 మందికి పైగా భార్యలే కాక ఇటువంటి ఏర్పాట్లు అనేకం ఉన్నాయి అక్బర్ కి.

"చక్రవర్తి నివాసానికి దగ్గర్లో ఒక మద్యపానశాల ఏర్పాటు చేశారు. అక్క-డికి లెక్కలేనంత మంది వేశ్యలు వచ్చి చేరేవారు. అక్బర్ ఆస్థానంలోని వారు నాట్యకత్తెలను తమ ఇళ్లకు తీసుకువెళ్లేవారు. కానీ కన్యలను తీ-సుకువెళ్లడానికి మాత్రం అక్బర్ నుండి ముందుగా అనుమతి తీసుకో-వాల్సి ఉండేది. ఒక్కొక్కసారి యువకుల మధ్య హింస చోటుచేసుకునేది. ఒకసారి అక్బర్ చాలా మంది వేశ్యలను తన ముందుకు పిలిపించి వాళ్ల కన్యత్వాన్ని దోచుకున్నదెవరని వాకబు చేశాడు " అంటూ ఈ అందాల రాకుమారుడి వైభోగాన్ని వర్ణిస్తాడు అయిన్-ఎ-అక్బరి అనే పుస్తకంలో అబుల్ ఫజల్.

అంతమంది వేశ్యలు ఒకే చోట ఏకకాలంలో ఎందుకు గుమికూడుతారు? వీళ్లందరూ అక్బర్ దోపిడీకి, కౄరత్వానికీ బలైపోయి, నిరాశ్రయులైన హిందూ కుటుంబాల నుండి వచ్చిన స్త్రీలే అనేది స్పష్టం. హిందూ స్త్రీ-లతో పోలిస్తే ముస్లిం స్త్రీలు ఎప్పుడూ బురఖా చాటున ఉంటూ కొంత-వరకు భద్రంగానే ఉండేవారు. అంతేకాక అక్బర్ ఎప్పుడూ తన ప్రవృత్తి-కోసం కాఫిర్ మగవారిని చంపుతూ, ఆడవారిని చెరపట్టి తీసుకువెళ్తూ ఉండేవాడు.

"బేగంలు కానీ, సభికుల భార్యలు కానీ, మరెవరైనా కన్యలు గానీ అక్బర్ కి అర్పించుకోవాలనుకుంటే ముందుగా అంతఃపుర అధికారికి అర్జీ పెట్టు-కోవాలి. ఆ అర్జి అక్కడినుండి రాజప్రాసాదానికి చేరుతుంది. అక్కడి అధి-కారులు ఆమోదించాక ఆ స్త్రీలకి అంతఃపుర ప్రవేశం లభిస్తుంది. వాళ్లు ఒక నెల వరకూ అంతఃపురంలో గడపవచ్చు" అని అక్బర్ నామా లో వ్రాస్తాడు అబుల్ ఫజల్.

దీన్నిబట్టి, జోధా ప్రేమికుడు అక్బర్ తన సభికుల భార్యలకు కూడ నెల-రోజుల చెర నుండి మినహాయింపునివ్వలేదని అర్థమవుతుంది. అక్బర్

ని ద్వేషించే వారి రచనలనుండి కాదు, అతని భట్రాజులు వ్రాసిన వ్రాతల-నుండే మనం ఈ విషయాలను తీసుకున్నామన్నది మీరు గమనించాలి.

రణతంభోర్ ఒప్పందంలో మొట్టమొదటి నియమం రాజపుత్ లు తమ సైనికులని విడిపించుకోవాలంటే తమ స్త్రీలను పల్లకీల్లో ఎక్కించి అక్బర్ అంతఃపురానికి పంపించాలని. శీలాన్ని కాపాడుకోవాలనుకుని, విలువ-ల్ని నిలబెట్టుకోవాలనుకునే స్త్రీలు జౌహర్ లు, చావులకు తెగించారంటే మరి దానిలో ఆశ్చర్యం ఏముంటుంది.

అక్బర్ తో వైరం వచ్చి మక్కాకు వెళ్లిపోతున్న అతని గురువు బైరం ఖాన్ ని అతని పాత శత్రువులు అడ్డగించి చంపారని చరిత్రకారులు వాదిస్తారు. కానీ నిజానికి అక్బర్ బైరం ఖాన్ ని చంపి అతని ఇష్ట సఖిని బలవంతంగా పెళ్లాడాడు.

అక్బర్ తన వేశ్యా బానిసలను తన సభికులకు పంచిపెట్టేవాడు. అక్బర్, అతని సభికులు వంటి పశువులకి ఆడవారు కేవలం పడక సుఖాన్నిచ్చే వస్తువులే.

అక్బర్ హయాంలో మీనా బజార్ కి చాలా పేరుండేది. అక్కడికి ప్రతి కొత్త సంవత్సరం నాడు వేరువేరు కుటుంబాలనుండి వచ్చిన స్త్రీలను బ్రతిమా-లి, మభ్యపెట్టి లేదా భయపెట్టి చక్రవర్తి ఎదుట వారి అందాలనారబోయిం-చేవారు. వారినుండి తనకు నచ్చిన వారినెన్నుకునెవాడు అక్బర్.

## దయామయుడైన అక్బర్ ది గ్రేట్

అక్బర్ భారత దేశాన్నేలిన రాజుల్లోకెల్లా దయామయుడని ప్రతీతి. తనికి వంశపారంపర్యంగా వచ్చిన ఆ 'దయాగుణాన్ని' తన 14వ ఏటే ప్రదర్శిం-చాడు అక్బర్. అతనికీ, హేముకి మధ్య పానీపట్ యుద్ధం జరిగుతున్న సందర్భంలో నవంబర్ 6, 1556 న మొఘల్ సైన్యానికి పెద్ద యెత్తున ప్రా-ణనష్టం సంభవించింది. కానీ ఒక దశలో హేము కంటికి బాణం గుచ్చుకుని అతను అపస్మారక స్థితిలోకి వెళ్లిపోయాడు. దాంతో అతని సైన్యం ఓటమి భయంతో చెల్లాచెదురైపోయింది. అపస్మారక స్థితిలో ఉన్న హేముని మన 'దయామయుడి' ముందుకి తీసుకువచ్చారు అతని సైనికులు. హేము ని చంపితే 'ఘాజీ' అనే బిరుదు అక్బర్ సొంతమౌతుందని బైరం ఖాన్ చెప్పాడు. ముస్లిం మతోన్మాదుల దృష్టిలో ఘాజీ అనే బిరుదు అత్యంత ప్రతిష్ఠాత్మకమైనది. అది ఒక కాఫిర్ (లేదా ముస్లిం మతాన్ని నమ్మని-

వాడు) ని చంపిన తరువాత మాత్రమే లభిస్తుంది. అటువంటి వీరునికి స్వర్గంలో కూడ అత్యున్నత స్థానం ఉంటుందని, అతిలోక సుందరులైన కన్యలు దొరుకుతారని నమ్ముతారు.

దాంతో అల్లాని తృప్తిపరిచి, ఆ శాంతి దూత - ముహమ్మద్ - కి తన కృతజ్ఞత తెలుపుకుందామని అపస్మారక స్థితిలో ఉన్న బాధితుడి మెడ నరికాడు అక్బర్. అతని సహచరులు మిగతా కార్యక్రమాన్ని పూర్తి చేశారు. హేము శరీరాన్ని ముక్కలుగా నరికారు. అతని తలని కాబుల్ కి పంపించి, మొండాన్ని ఢిల్లీ వీధుల్లో వేలాడదీసి అక్బర్ దయాగుణాన్ని ప్రజలకి చాటి చెప్పారు.

ఇది జరిగిన వెంటనే అక్బర్ సైన్యం ఢిల్లీకి కవాతు చేసుకుంటూ వెళ్లి, వాళ్లు నరికిన తలలను అక్కడ గుట్టలుగా పోసి నిలబెట్టారు. విజయ సంబరాల్ని ఈవిధంగా జరుపుకొనే ఆనవాయితీని నిస్వార్థంగా అన్ని తరాల వారికీ అందిస్తూ వచ్చారు కద మొఘలులు!

ఈ బృహత్తర కార్యక్రమానికి సరైన ముగింపు పలకడానికి హేము తండ్రిని కూడ చంపేసాడు అక్బర్. ఇక వాళ్ల స్త్రీల పరిస్థితి ప్రత్యేకంగా చెప్పనక్కర్లే-దు. వాళ్లకోసం భారీ అంతఃపురాలు ఉండనే ఉన్నాయి.

అబుల్ ఫజల్ వ్రాసినదాని ప్రకారం, ఖాన్ జమాన్ చేసిన తిరుగుబాటు-ను ఎదుర్కోడానికి అతని నమ్మిన బంటు మొహమ్మద్ మిరాక్ ని కాళ్లు చేతులు కట్టిపడేసి ఏనుగుల ముందు నిలబెట్టారు. ఏనుగు తన తొండంతో అతన్ని ఎత్తి విసిరేసింది. మళ్లీ అతన్ని తీసుకువచ్చి ఏనుగు ముందు నిలబెట్టారు. ఇలా ఐదు రోజులపాటు అతన్ని హింసించిన తరువాత అతన్ని చంపేశారు. ఇవన్నీ అబుల్ ఫజల్ ఖండించడం అటుంచి ఎంతో గొప్పగా వివరిస్తాడు.

చిత్తోడ్ ని కైవసం చేసుకున్న అక్బర్ 30,000 మంది నిరాయుధులైన ప్రజలను అతి కిరాతకంగా నరికి చంపాడు.

అక్బర్ జనాన్ని హింసించడంలో, చంపడంలో అనేక కొత్త పద్ధతులు అవలంభించేవాడు. ముజఫర్ షా ని ఏనుగులతో తొక్కి చంపించాడు. హంజబాన్ నాలుకని తెగ్గోశాడు. మసూద్ హుస్సేన్ మిర్జ కళ్లను సూదితో కుట్టేశాడు. అతని అనుచరులు 300 మందిని బంధించి వాళ్ల తలలు గాడిద, గొర్రె, కుక్క చర్మాలతో కప్పి కుట్టేసి తీసుకువచ్చారు. తరువాత

వాళ్లందరినీ చంపేశారు. ఉరి తీయడం, తలలు నరకడం, శరీరావయవా-లను తీసేయడం, లాఠీలతో కొట్టడం వంటి అనేక విధాల హింసను స్మిత్ తన పుస్తకంలో వివరిస్తాడు. తీర్పులు, నిర్ణయాలను ఎక్కడా వ్రాసేవారు కారు. కేవలం ఖురాన్ లోని 'శాంతియుత' ప్రవచనాల ప్రకారం నడుచు-కునేవారు. అంతే!

సెప్టెంబరు 2, 1573 లో అతను 2,000 కు పైగా తలలను నరికి అహ్మ-దాబాద్ లో గుట్టగా పోశాడు. బహుశా ఇది చరిత్రలోనే అతిపెద్ద శవాల గుట్ట అయ్యుంటుంది. (అంతకుముందు అతని తాత బాబర్ పేరున ఈ రికార్డు ఉండేది.)

బెంగాల్ రాజు దావూద్ ఖాన్ ని ఓడించినప్పుడు ఎనిమిది ఎత్తైన గుట్టలకి సరిపడ తలలు నరికానని వ్రాసుకున్నాడు అక్బర్ తన ఆత్మకథ అక్బర్ నామా లో. దావూద్ ఖాన్ చావడానికి సిద్ధంగా ఉన్నప్పుడు త్రాగడానికి నీళ్లు అడిగితే చెప్పుల్లో నీళ్లు పట్టి ఇచ్చారు.

## నిఖార్సుగా ఉండే అక్బర్ ది గ్రేట్

తానేశ్వర్ లో ఒక ప్రార్థనా స్థలం విషయంలో కురు, పురి వర్గాల మధ్య వివాదం చెలరేగింది. అది తేల్చుకోడానికి ఇరువర్గాలు యుద్ధం చేయాలని, గెలిచిన వారికి ఆ స్థలం దక్కుతుందని అక్బర్ చెప్పాడు. ఆ మూర్ఖులు ఆయుధాలు తీసుకుని యుద్ధానికి బయలుదేరారు. ఒక దశలో పురి వర్గానిది పైచేయిగా ఉన్నప్పుడు అక్బర్ తన సైన్యాన్ని కురు వర్గానికి సాయంగా పంపించాడు. ఆఖరికి ఇరు వర్గాల వారినీ అక్బర్ సైనికులు చంపేశారు. అక్బర్ కి ఇది ఎంతో సంతోషాన్నిచ్చింది.

హల్దీ ఘాటి యుద్ధంలో రాజపుత్ లు ఒకరినొకరు చంపుకునేలా చేశాడు అక్బర్. తన సైన్యాన్ని రాణ ప్రతాప్ సైన్యాన్ని ఎలా గుర్తుపడతావని అక్బర్ ని బదయుని అడిగినప్పుడు తాను గుర్తుపట్టాల్సిన అవసరం లేదని, వారిలో ఎవరు చచ్చినా ఆఖరికి ఇస్లాం మాత్రం గెలుస్తుందని అన్నాడు.

అక్బర్ ఏకలింగ విగ్రహాన్ని ధ్వంసం చేసి నమాజు చేయడానికి ఒక చప్టా కట్టిచాడని గుర్తు చేసుకుంటారు కల్నల్ టాడ్. అక్బర్ మత సామరస్యా-నికింతకంటే గొప్ప నిదర్శనమేం కావాలి?

ఒక సారి అక్బర్ మధ్యాహ్నం త్వరగా నిద్ర లేచినప్పుడు తన మంచం

దగ్గర ఒక పనివాడు నిద్ర పోతూ ఉండడం గమనించాడు. అది చూసి ఎంతో ఆగ్రహించిన అక్బర్ అతన్ని కోట బురుజు పైనుండి తోసివేయించాడు.

ఆగస్టు 1600 వ సంవత్సరంలో అక్బర్ సేనలు అసిర్ ఘఢ్ కోటను ముట్టడించాయి. ఇరు వర్గాలు సమ ఉజ్జీగా నిలవడంతో అక్బర్ ఒక 'ఉదాత్తమైన' ఆలోచనతో ఈ సదిగ్ధాన్ని తొలగించాలనుకున్నాడు. రాజా మిరణ్ బహద్దూర్ ని చర్చల కోసం కోట బయటకి రమ్మని, అతని ప్రాణాలకు తన ప్రాణాలడ్డువేస్తానని నమ్మబలికాడు అక్బర్. లొంగిపోవడానికి వచ్చిన మిరణ్ అక్బర్ ముందు గౌరవసూచకంగా తల వంచాడు. వెంటనే అతన్ని నేలపైకి పడదోసి పూర్తి 'సజ్దాహ్' (నుదుటిని, అరిచేతులని నేలకానించి మోకాళ్లపై కూర్చుని మోకరిల్లడం - ఇది పూర్తిగా లొంగిపోయిన సూచన) చేయించారు. ప్రపంచం ఎప్పుడూ తనకి సజ్దాహ్ చేయడానికే అలవాటు పడ్డవాడు మరి అక్బర్.

తరువాత మిరణ్ణి బంధించి అతని సైన్యాధ్యక్షుడిని కూడ లొంగిపొమ్మని చెప్పాలని మిరణ్ పైన ఒత్తిడి తెచ్చారు. సైన్యాధ్యక్షుడు దానికి నిరాకరించి, ఇచ్చిన మాట ఎందుకు తప్పారో కనుక్కోవడానికి అతని కొడుకుని పంపించాడు. అతని తండ్రి లొంగిపోతాడా లేదా అని ఆ యువకుడిని అడిగినప్పుడు ఈ రాజుని చంపితే వేరొక రాజుని ఎన్నుకుంటాం కానీ లొంగిపోయే ప్రసక్తేలేదని ఆ యువకుడు చెప్పాడు. దీంతో ఆగ్రహించిన అక్బర్ ఆ యువకుడిని చంపమని తన సైన్యానికి ఆదేశాలిచ్చాడు. మొత్తానికి చాలా కుతంత్రాలు, మోసాలు చేసిన తరువాత ఆ కోటని ఆక్రమించగలిగాడు అక్బర్.

ఇవన్నీ జరిగింది అక్బర్ మరణానికి అయిదు సంవత్సరాల ముందే. అంటే అతని జీవితకాలంలో అతనిలో ఇసుమంతైనా మార్పు వస్తుందనే ఆశే నిరర్ధకమైనది. అతనిలో మార్పు రావడం అసాధ్యం.

అలాగే, అధికార దాహంతో అతను బుందేల్ ఖండ్ రాణి దుర్గావతి మీద దండెత్తి అక్కడి ప్రజలని కిరాతకంగా నరికి చంపాడు.

## అక్బర్ కి, మహారాణ ప్రతాప్ కి పోలిక

అక్బర్ స్తుతించే చరిత్రకారులు మహారాణ ప్రతాప్, అక్బర్ ఇద్దరూ బద్ధ శత్రువులు, సమఉజ్జీలు అయినా కూడ మహారాణ ఎందుకు ఘనుడు

కాలేడో వివరణ ఇవ్వలేకపోయారు.

ఛిత్తోడ్ పైన అక్బర్ దాడిచేయడానికి అతని అధికార దాహం తప్ప మరే కారణం కనబడదని స్మిత్ కూడ ఒప్పుకుంటాడు. మహారాణ తన దేశం కోసం పోరాడాడు. వీలైనంత మంది రాజ్ పుత్ లని ఏకం చేసి విదేశీ రాజులకి తమ స్త్రీలని అప్పగించే దౌర్భాగ్యాన్నుండి వీరిని తప్పించా-లని తాపత్రయపడ్డాడు. కానీ అక్బర్ కేవలం రాజ్య విస్తరణ కాంక్షతోనే యుద్ధాలు చేసిన ఒక స్వార్ధపరుడు, ఉగ్రవాది.

కానీ ద్రోహుల రక్తం కలిసిన మేథావులీనాడు మహారాణ ప్రతాప్, శివాజీ వంటి మహానుభావులు చేసిన యుద్ధాలు కేవలం తమ చిన్న రాజ్యాలను కాపాడుకోవడం కోసమేనని, అక్బర్, ఔరంగజేబు వంటి నరరూప రాక్ష-సులు యుద్ధాలు చేసింది మాత్రం దేశ సమైక్యానికని వాగుతుంటారు. కానీ నిజం ఏమిటంటే, హత్యలు, దోపిడీలు, మానభంగాలు విచ్చలవిడిగా జరుగుతున్నా చూస్తూ ఉండిపోయిన నపుంసక రాజులున్న చీకటిరోజు-ల్లో కాషాయాన్ని (కాషాయం అంటే వితండవాదం కాదు. జాతీయవాదా-నికి చిహ్నం) కాపాడిన పోరాట యోధులు శివాజీ, ప్రతాప్. నేరస్తుల ప్రా-బల్యం తగ్గడానికి, వాళ్ల కృూరత్వానికి మనవారు పూర్తిగా బలైపోకుండా ఉండడానికి వీళ్లు చేసిన కృషి ఎంతో అభినందనీయం.

## అక్బర్ - ఇస్లాం

ఇస్లాంలో ఉన్న మంచికి నిదర్శనం అక్బర్ అని చెప్పి ముస్లింలని మభ్య-పెడుతుంటారు. కానీ అతని పూర్వీకుల మాదిరిగానే అక్బర్ లో ఇస్లాం భావన ఏమాత్రం లేదు. ఇస్లాం ని తన రాజకీయ ప్రయోజనాలకి మాత్రమే వాడుకున్న కసాయి వాడు అక్బర్. ఉదాహరణకి అతను తాగుబోతు, మాదకద్రవ్యాలకు బానిస, అతనికి మూడు డజన్లకుపైగా భార్యలున్నా-రు. ఇవన్నీ ఇస్లామిక్ విలువల్ని నిలువునా పాతేయడమే.

అక్బర్ తనను తాను దైవంగా ప్రచారం చేసుకునేవాడు. ప్రజలు ఒకరినొ-కరు 'అల్లా-ఒ-అక్బర్' అని పలకరించుకోవాలని ఒత్తిడి చేసేవాడు అక్బర్. అల్లా గొప్పదనాన్ని పొగుడుతున్నామనుకున్న పిచ్చి ప్రజలు అతను చెప్పింది చేశారు. నిజానికి 'అల్లా-ఒ-అక్బర్' అనే పలకరింపు ఇస్లాంలో లేదు. అక్బర్ తనని తాను సర్వజ్ఞుడిగా భావించేవాడని అబుల్ ఫజల్ అంటాడు.

అక్బర్ 'దీన్-ఎ-ఇలాహి' అని ఒక కొత్త మతాన్ని మొదలుపెట్టాడు. దాని ముఖ్య ఉద్దేశం కేవలం అతన్ని, అతని మూర్ఖమైన, అస్పష్టమైన ఆలోచనల్ని పొగడడమే. అందుకే, అతని భట్రాజులు దాన్ని ఆమోదించినా, అది అక్బర్ చావుతోనే ఎందుకంతమయిందో మనకర్ధమౌతుంది.

అక్బర్ ని ఆకాశానికెత్తడానికి గల కారణాలు స్పష్టం. అతను హిందూ మతాన్ని, ఇస్లాంనీ కూడ తన స్వార్ధంకోసం కించపరిచినవాడు. కాబట్టి బైబిల్ ప్రాబల్యాన్ని పెంచాలనుకునే వాళ్ళకి అతన్ని మించిన నీచుడు దొరకడు. అందుకే అతన్ని వెలుగులోకి తెచ్చారు. నిజానికి అక్బర్ తన దైవత్వాన్ని ప్రజలపైన రుద్దడానికి హిందు, ముస్లిం, క్రిష్టియన్ మతాలన్నింటినీ అవసరమైనప్పుడల్లా వాడుకున్నాడు.

అక్బర్ కి భాషపైన చాలా గొప్ప పట్టుండేది. అంతటి భాషాకోవిదుడికి ఇంతటి  క్రూరత్వం ఉండడం ఎంతో వైవిధ్యంగా వుంటుందంటూ ఆరాధనాపూర్వకంగా వ్రాస్తాడు విన్సెంట్ స్మిత్. తనని తాను దైవదూతగా చెప్పుకునే వాడికి ఇంతకంటే గొప్ప లక్షణాలికేముండాలి!

అక్బర్ తను కాళ్లు కడుక్కున్న నీటికి (చరణామృతం) రోగాలను నయంచేసే గుణాన్నిచ్చే మహిమ కూడ తనదగ్గరుందని ప్రచారం చేసుకునేవాడు. ముహమ్మద్ కి ఎలాంటి శక్తులున్నాయని షాహి బుఖారి, షాహి ముస్లిం లు తాము వ్రాసిన హదిత్ లలో చెప్పుకొచ్చారో అలాగే అక్బర్ తనకున్న శక్తులగురించి చెప్పుకునేవాడు. అందుకే అతని చరణామృతం కోసం జనం బారులు తీరడాన్ని ప్రోత్సహించేవారు. కానీ ఇస్లాం కి వ్యతిరేకంగా ఉన్నట్టు కనపడకుండా ఉండడం కోసం కొంత మంది హిందువులను కూడ ఈ పని చేయనిచ్చేవారు. అతని సభికులు అతన్ని సంతృప్తిపరచడానికి ఆ చరణామృతాన్ని తాగాల్సిఉండేది.

కొంతమంది చదువుకోని స్త్రీలు తమ బిడ్డల్ని అతని పాదాలదగ్గరుంచి ఫకీర్ నుండి ఆశీస్సులు తీసుకున్నట్టు అతని నుండి ఆశీస్సులు తీసుకునేవాళ్లు. ఇటువంటి పిచ్చి చేష్టలే అతను కొత్త మతాన్ని ప్రకటించేలా చేయడానికి నాంది పలికాయి.

## అక్బర్ ది గ్రేట్ - జజియా పన్ను

ఇస్లామిక్ షరియా నియమాల్లో ముస్లిమేతరులు ముస్లింల చేతుల్లో మానభంగాలు, హత్యలు, దోపిడీలకు గురవ్వకుండా ఉండాలంటే జజియా

పన్ను కట్టాలనే గొప్ప నియమం ఒకటుంది. అక్బర్ జజియా పన్నుని నిషేధించాడని చెప్తారు కానీ దానికి సంబంధించిన ఒక్క ఆధారం కూడ ఎక్కడా కనిపించదు. ఈ మినహాయింపు కేవలం రణతంబోర్ ప్రజలకి మాత్రమే కల్పించారు. అదీ, తమ ఆడవారిని అక్బర్ హరెంకి కానుకగా పంపించారు కాబట్టి.

ప్రజలు అతన్ని జజియా పన్ను రద్దు చేయమని ప్రాధేయపడిన మాట వాస్తవం. అతని రాజకీయ ప్రయోజనాలకోసం కొద్ది మందికి మినహాయింపు ప్రకటించి ఉండొచ్చు కానీ ఈ పన్నుని పూర్తిగా ఎప్పుడూ రద్దు చేయలేదు అక్బర్. అలా చేస్తే ఇస్లాంకి అన్యాయం చేసిన వాడు అవుతాడు కద!

## అక్బర్ ది గ్రేట్ - అతని కొడుకు

తండ్రి మీద తిరుగుబాటు చేయని కొడుకు ముస్లిం రాజుల్లో చాలా అరుదు. తిరుగుబాటు చేసే ఆనవాయితీని తప్పించిన వారు ఎవరూ లేరు. హుమయూన్ వల్ల బాబర్ కి, జహంగీర్ వల్ల అక్బర్ కి, షాజహాన్ వల్ల జహంగీర్ కి, ఔరంగజేబ్ వల్ల షాజహాన్ కీ ఇలా అందరికీ ఈ పోరు తప్పలేదు. జహంగీర్ (ఉరఫ్ సలీం) 1602 లో తనని తాను చక్రవర్తిగా ప్రకటించుకుని అలహాబాదులో ఆస్థానాన్ని ఏర్పాటు చేసుకున్నాడు.

జహంగీర్ తండ్రి మరణాన్ని కోరుకున్నాడు. తన నాణాల వ్యవస్థ తను ఏర్పాటు చేసుకున్నాడు. అతని తిరుగుబాటు విజయవంతమైయ్యుంటే అక్బర్ కి చావు తప్పదికాదని వ్రాస్తాడు స్మిత్. అతను తండ్రిని చంపే సువర్ణావకాశాన్ని వదులుకున్నాడు కానీ మనుమడు ఔరంగజేబుకి మాత్రం ఆ భాగ్యం దక్కింది. కొంత మంది చరిత్రకారులు మాత్రం అక్బర్ కి విషమిచ్చి జహంగీరే చంపాడని చెప్తారు.

## అక్బర్ ది గ్రేట్ చే అనుమానించబడిన వారి పరిస్థితి

అక్బర్ కేవలం తనకి గిట్టని వారికి విషమిచ్చి చంపడానికే తన ఆస్థానం-లో ఒకర్ని నియమించుకున్నాడు. తను పెట్టిన విషాహారాన్ని తానే పొ-రపాటున తినడం వల్ల అక్బర్ చనిపోయాడని కొంతమంది చరిత్రకారులు వాదిస్తారు.

అక్బర్ కు అత్యంత నమ్మకస్థులు, అంతగా నమ్మకం లేని వాళ్లు కూడ

అనేకమంది అనుమానాస్పదంగా మరణించారు: బైరం ఖాన్, జమాన్, అసఫ్ ఖాన్ (అతని ఆర్థిక మంత్రి), షా మన్సూర్, మాన్ సింగ్, కమ్రన్ కొడుకు, మఖ్దుమ్-ఎ-ముల్క్, షేక్ అబ్దుర్ నబీ, ఫర్గుండి, ముయిజుల్ ముల్క్, హాజీ ఇబ్రహీం, ఇంకా అతనికి నచ్చని ముల్లాలందరు. ఈ చిట్టా మొత్తం స్మిత్ వ్రాసిన పుస్తకంలోదే.

జైమల్ ని చంపి అతని భార్యని తన హరెంలోకి తీసేసుకున్న అక్బర్ ఆమె సతీ సహగమనం చేసుకుంటుంటే తానే ఆమెని కాపాడానని చెప్పుకున్నాడు.

## అక్బర్ ది గ్రేట్ దాతృత్వం

అక్బర్ పాలనలో చనిపోయిన వారి ఆస్తి మొత్తం చక్రవర్తికే చెందుతుంది. చనిపోయినవాని కుటుంబానికి ఆ ఆస్తి మీద ఎటువంటి హక్కులు ఉండవు. కానీ అప్పుడప్పుడు మాత్రం తన దయాగుణాన్ని చాటడానికని అలా చనిపోయినవారి కుటుంబాలు ఏదన్నా కొత్త వ్యాపారం చేసుకోడానికి అనుమతించేవాడు అక్బర్.

అక్బర్ తను చనిపోయి ఈ భూభారాన్ని కొంత తగ్గించడానికి ఏడాది ముందే అతని తల్లి మరణించింది. తన ఆస్తిని పిల్లలందరికీ సమానంగా పంచాలన్న ఆమె అభిమతాన్ని పక్కకు నెట్టి మొత్తం ఆస్తిని తనే తీసుకున్నాడు అక్బర్.

## అక్బర్, అతని నవరత్నాలు

విక్రమాదిత్యుని కథలనాధారంగా చేసుకుని అక్బర్ కి కూడ నవరత్నాలనే 9 మంది అత్యంత నైపుణ్యం కలిగిన మంత్రులుండేవారనే కట్టు కథలనల్లారు చరిత్రకారులు. కానీ నిజానికి అక్బర్ కు తన మంత్రులందరూ తెలివితక్కువ దద్దమ్మలే అనే అభిప్రాయం ఉండేది. దేవుని దయవల్ల తన ఆస్థానంలోని అందరూ పనికిరాని వాళ్లే ఉండడంతో తను చేసే మంచి పనులు తన తెలివితేటలతో కాక మంత్రుల సాయంతోనే చేస్తున్నాననే అపవాదు ప్రజల్లో రాకుండా ఉంటుందని అనేవాడు.

ఎంతో గొప్ప పేరున్న తొడర్మల్ నిజానికి అక్బర్ కి డబ్బులు వసూలు చేసిపెట్టే ఒక దళారి మాత్రమే. అతని పంథా ఒక్కటే - అయితే డబ్బులు కట్టాలి, లేదంటే కొరడా దెబ్బలు తిని భార్యాపిల్లల్ని అమ్ముకోవాలి.

అబుల్ ఫజల్ ఒక భట్రాజు. అక్బర్ ని మెప్పించడం కోసం కట్టుకథలనల్లి అతని భజన చేసేవాడు. ఆఖరుకి అతను జహంగీర్ చేతిలో చనిపోయా-డు.

ఫైజీ ఒక సాధారణ కవి. తన మాలిక్ ని తన పొగడ్తలతో తృప్తి పరిచేవా-డు. చాలా మంది చరిత్రకారులు అతనొక గొప్ప కవి అని, అతని కాలంలో భారతదేశంలోకెల్లా గొప్పవాడని చెప్తారు. నేను చెప్పేదల్లా ఒక్కటే. అక్బర్ ఆస్థానంలో ఉన్న కవులందరు అతనిలాగే చదువులోనూ, విషయపరి-జ్ఞానంలోనూ దిగజారిన స్థాయి వారే.

బీర్బల్ ఒక యుద్ధంలో అత్యంత అవమానకరమైన చావు చచ్చాడు. అక్బర్-బీర్బల్ పేరుతో ప్రాచుర్యంలో ఉన్న కథలన్నీ కూడ కట్టుకథలే. నిజానికి ఆ కథలు దక్షిణభారతంలో తెనాలి రామ కృష్ణుడి పేర్న ఉన్న కథలే.

షా మన్సూర్ ని అక్బర్ ఆజ్ఞానుసారం అబుల్ ఫజలే చంపేశాడు.

మాన్ సింగ్ భరతమాత కడుపున పుట్టిన ద్రోహులందర్నీ మించినవా-డు. తన చెల్లెల్ని జహంగీర్ కి ఇచ్చాడు. జహంగీర్ అంతటితో ఆగకుండ, మాన్ సింగ్ మనుమరాలిని కూడ తన హరెంలోకి బలవంతంగా తీసుకు-పోయాడు. మాన్ సింగ్ ని అక్బర్ విషమిచ్చి చంపాడు. మాన్ సింగ్ తండ్రి భగవాన్ దాస్ ఆత్మహత్యకి పాల్పడ్డాడు.

అక్బర్ చరణామృతం త్రాగడమే కాకుండ అతని కృపకి పాత్రులవ్వాలం-టే తమ భార్యాపిల్లల్ని, కుటుంబ సభ్యుల్ని కూడ అక్బర్ కి కానుకగా ఇవ్వాలి అతని ఆస్థానంలోని వారు.

అక్బర్ ఆర్థిక వ్యవహారాలని తోడర్మల్ అత్యంత నమ్మకంగా, నిరంకు-శంగా చూసుకునేవాడు. అటువంటి తోడర్మల్ పూజించుకునే విగ్రహాలనే అక్బర్ నాశనం చేయడంతో మనస్తాపం చెంది తన పదవికి రాజీనామా చేసి వారణాసి వెళ్లిపోయాడు తోడర్మల్.

## అక్బర్ ది గ్రేట్ కి బానిసల మీదుండే మమకారం

అక్బర్ ఒక రష్యన్ కుటుంబాన్ని క్రిష్టియన్ మత పూజారి అఖ్వీవ కి కానుకగా ఇచ్చాడు. దీన్ని బట్టి అక్బర్ దేశవిదేశాల వాళ్లని బానిసలుగా

ఉంచుకునేవాడని అర్ధమవుతుంది.

కాందహార్ లో 1581-82 మధ్య అక్బర్ చాలామందిని తన బానిసలుగా చేసుకున్నాడు. అతని విధానాలని ఎదిరించడమే వారు చేసిన నేరం. తరువాతి కాలంలో వాళ్లని అమ్మి గుఱ్ఱాలు కొన్నాడు అక్బర్.

చక్రవర్తి తన పటాలంతో ఎక్కడికైనా వెళ్తున్నప్పుడు అతని హరెంలోని స్త్రీలని జంతువుల్లాగా బంగారు పంజరాల్లో బంధించి తమవెంట తీసుకువెళ్ళేవాడు.

పవిత్ర ఇస్లామిక్ ఆచారాల ప్రకారం యుద్ధ ఖైదీలు బానిసలవుతారని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.

జనాన్ని బానిసలను చేసుకోడానికి అక్బర్ కొత్త కొత్త పద్ధతులు అవలంభించేవాడు. అతని అనుచరులు కనపడిన గుర్రం తల మీదల్లా ఒక పువ్వునుంచేవారు. ఆ గుర్రం యజమానికి 'హాబ్సన్స్ చాయిస్' (దొరికింది తీసుకోవడం, లేదంటే అన్నీ వదులుకోవడం) మాత్రమే ఉండేది - ఆ గుర్రాన్నైనా వదులుకోవాలి లేదంటే అక్బర్ దగ్గర ఊడిగం అన్నా చేయాలి. ఆ రోజుల్లో ప్రయాణానికి, ఒక దగ్గరినుండి మరో దగ్గరికి వస్తువులు తీసుకువెళ్లడానికీ గుర్రాలొక్కటే మార్గం. నేటి సోమాలీయా రాజధానికంటే దుర్భరంగా ఉండేది అప్పటి పరిస్థితి.

**ఇతరత్రా**

అక్బర్ చనిపోయినప్పుడు ఒక్క ఆగ్రా కోటలోనే 2 కోట్ల స్టర్లిగులు (బ్రిటీషు కరెన్సీ. ఒక స్టర్లింగ్ నేటి రోజున దాదాపు 100 రూపాయలతో సమానం) ఉన్నాయి. ఇంచుమించు ఇలాంటి మొత్తాలే మిగతా 6 నగరాల్లోను దొరికి ఉంటాయి. అంత డబ్బు ఉన్నా, 1595-1599 మధ్య వచ్చిన భయంకరమైన కరువునెదుర్కోడానికి అతను డబ్బు ఏమీ ఖర్చు చేయలేదు. అంతటి కరువు వస్తేనే ఏమీ సాయం చేయనివాడు 1573-74, 1583-84 ల మధ్య వచ్చిన కరువు అప్పుడు ఏ మాత్రం ఖర్చు చేసుంటాడో మీకే అర్థం అవుతుంది.

త్రివేణి సంగమం జరిగే ప్రయాగ్ రాజ్ (తరువాత అలహాబాద్ గా పేరు మార్చాడు ఈ కసాయి. ఈ మధ్యే ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం దీన్ని తిరిగి ప్రయాగ్ రాజ్ గా మార్చేసింది) ఒడ్డున ఉన్న జనాభానంతటినీ తుడి-

చిపెట్టేసాడు అక్బర్. తను దాడి చేసినప్పుడు అందరూ ఇళ్లలో దాక్కొని ఉండడంతో అన్ని కట్టడాల్నీ నేలమట్టం చేయించాడు అక్బర్. అందుకే అక్కడ పాత కట్టడాలు ఏమీ మనకి కనపడవు.

అతను ఫతేపూర్ సిక్రీ ని కట్టించాడనేది శుద్ధ అబద్ధం. దానికి ఎటువంటి ఆధారాలు లేవు. ఇస్లాంకి విధేయులమని చెప్పుకునే మోసగాళ్లైన ఇతర ముస్లిం పాలకుల లాగానే ఇతను కూడ ఆ నగరాన్ని ఆక్రమించుకొని తనే కట్టించినట్లు చెప్పుకున్నాడు. తరువాత అతనిలాగే అతని మనుమడు షాజహాన్ తను కట్టించని తాజ్ మహల్ ను తన నాల్గవ భార్య జ్ఞాపకార్థం తనే కట్టించినట్టు ప్రకటించుకున్నాడు.

## ముగింపు

అక్బర్ వంటి నేరస్థులను పూజించి గర్వపడే ఏ దేశమైనా నాశనం కావడం తథ్యం. పంచతంత్రంలో చెప్పినట్టు ఎక్కడైతే అపాత్రులను పూజించి పాత్రులను విస్మరిస్తారో అక్కడ మృత్యువు, భయం, అరాచకత్వం తాండవిస్తుంది.

ఈ అబద్ధపు వీరుల ముద్రలను మన మనసుల్లోనుండి, దేశంలోనుండి తొలగించి, ఇన్నాళ్లు మనం విస్మరిస్తూ వస్తున్న మన నిజమైన వీరులు, త్యాగమూర్తులకు మన నివాళులర్పించాల్సిన సమయం ఆసన్నమైంది. ఈ కసాయి పాలకుల పేర్లు కూడ కనిపించకుండా పోయేంత పైస్థాయికి మన సమాజాన్ని తీసుకురావాలి హిందువులు. ఇస్లాంకే కళంకం తెచ్చి మతాన్ని అవమానించిన ఈ ఉగ్రవాదులని చెత్తకుప్పలో పడేసి ముందుకు సాగాలి ముస్లింలు.

మన నిజమైన చరిత్ర మధ్య కాలంలో వచ్చిన దుర్మార్గులు, దుష్టులని పక్కనపెట్టి మనల్ని మన మూలాలకి దగ్గరగా తీసుకువెళ్తుందని, ఇటువంటి దుష్ట శక్తులకి ఎప్పటికప్పుడు గట్టి గుణపాఠం చెప్పడం ఎంత ముఖ్యమనే విషయాన్ని, భవిష్యత్తులో ఇటువంటి దుర్మార్గులు మనజోలికి రాకుండా ఉండడానికి ఏమి చేయాలనే విషయాన్ని, మనకెంతో అవసరమయిన మరెన్నో పాఠాలను నేర్పిస్తుందని ఆశిద్దాం. అసత్య వీరులను పూజించడం వల్ల మన గౌరవం క్షీణించి జాతి నిర్వీర్యమౌతుందని మనం తెలుసుకోవాలి.

తమ పూర్వీకులు అత్యంత నిరాదారణకు గురైయ్యారని, హింసించబడ్డారని, ఆ తరువాత వాళ్లని ఇస్లాంలోకి ఆ ఉగ్రవాదులు బలవంతంగా మార్చారని గుర్తించాలి ముస్లింలు. ఆ నరరూప రాక్షసులకి తెలిసిందల్లా తలలు నరికి గుట్టలుగా పోయడం, ఎక్కడపడితే అక్కడ స్త్రీలని మానభంగం చేయడం మాత్రమేనని గుర్తించాలి.

సక్రమంగా ఆలోచించే ముస్లింలు మధ్యయుగంలో తమవారికి జరిగిన ఘోరాలను, అవమానాలను తిప్పికొట్టి తమ నిజమైన మూలాలను వెతుక్కుంటూ తిరిగి వస్తారని ఆశిద్దాం. నా దేశం, ప్రజలు తమ శౌర్యాన్ని తిరిగి తెచ్చుకుని నిర్వీర్యమైపోయిన జాతిలో నూతనోత్సాహం నింపుతారని కోరుకుంటున్నాను. నిజమైన ఆధ్యాత్మికతకు ఇది ఎంతో ఆవశ్యకం.

# 5

# జోధా అక్బర్ - మతం పేరిట ఓ కూతురి మానభంగం

ఇది ఒక దిగ్భ్రాంతికరమైన, నిషేధించబడినటువంటి కథ. ఇది వావి వరసలు, చిన్న పెద్ద తారతమ్యం మరచి జరిగిన ఓ కామ కేళి. ఇది మొఘలుల అంతఃపురాల్లో జరిగిన మరొక నీచమైన చీకటి గాథ. చరిత్రకారులు దీన్ని బహిరంగపరచాలంటే జంకేంత జుగుప్సాకరమైన వ్యథ. ఇది వింటే భారతీయ సినిమాలు, టివి సీరియళ్లు మొఘలుల చరిత్రను చూపిస్తూ తయారుచేసిన ఓ రంగుల ప్రపంచం పటాపంచలవుతుంది. దిలీప్ కుమార్ నటించిన మొఘల్-ఎ-ఆజమ్ సినిమా నుండి ఏక్తా కపూర్ తీసిన జోధా అక్బర్ టీవి సీరియల్ వరకు ఏదీ దీనికి మినహాయింపు కాదు.

ప్రేమ స్థానంలో కామం కనబడుతుంది. అనురాగం స్థానంలో వావి వరసలు లేని కుతి కనబడుతుంది. విధేయత స్థానంలో కుట్రలు కనబడతాయి. శృంగారం బదులు అశ్లీలత కనబడుతుంది. సినిమాలు, పార్శ్య

పుస్తకాలు మీకు చూపించకుండా దాచేసిన నీచమైన కథ ఒకటి మీకు చరిత్ర చెబుతుంది. తండ్రి కూతుళ్ల అనుబంధానికే కళంకం తెచ్చిన కథ ఇది.

## జోధా అక్బర్ కి భార్యగా ఎక్కడా కనపడదు

జోధా అక్బర్ కి భార్య కాదు. అతనికి 40 మందికిపైగా భార్యలున్నారు, 5,000 కు పైగా ఉంపుడుగత్తెలున్నారు. కానీ వీళ్లలో ఎవరూ జోధా అనే స్త్రీ ఉన్నట్లు ప్రస్తావన లేదు.

యుద్ధం నుండి పడక గది వరకు అక్బర్ వీరత్వాన్ని కథలు కథలుగా వర్ణిస్తూ అతని భట్రాజులు వ్రాసినవి నాలుగు పుస్తకాలు. అవి - అబుల్ ఫజల్ వ్రాసిన అయిన్-ఎ-అక్బరి, అక్బర్ నామా, బదయుని వ్రాసిన ముంతఖబ్-ఉత్-తవారిఖ్, నిజాముద్దీన్ వ్రాసిన తబఖత్-ఇ-అక్బరి. కానీ వీటన్నింటిలో ఎక్కడా జోధాని గురించి కానీ, కనీసం దానికి దగ్గరగా ఉండే పదం కానీ కనిపించదు. అక్బర్ హరెం(వేశ్యావాటిక కూడ)లో జోధ్పూర్ నుండి వచ్చిన ఏ స్త్రీ కూడ ఆ పేరుతో లేదు, ఒక్కరు తప్ప. ఆమే జహంగీర్ భార్య జోధా.

మాన్ సింగ్ (భారత చరిత్రలోకెల్లా అత్యంత నీచమైన దేశ ద్రోహి) పిన్ని/ పెద్దమ్మ ని అక్బర్ పెళ్లి చేసుకున్నాడు. ఆవిడే అక్బర్ బలవంతంపై ముస్లిం మతం తీసుకున్నాక మరియం-ఉజ్-జమాని గా మారిన హీరా కుంవరి.

## జహంగీర్ కి జోధా చెల్లెలు, భార్య కూడ అని చరిత్ర చెబుతుంది.

మాన్ సింగ్ కి, అతని చెల్లెలు మన్మతీ బాయి కి అక్బర్ తండ్రి తరఫు మేనమామ వరస. 1585 లో మన్మతీ బాయి చిన్న పాపగా ఉన్నప్పుడే పదహారేళ్ల తన కొడుకు జహంగీర్ కిచ్చి పెళ్లి చేయాలని పట్టుబట్టాడు అక్బర్. మన్మతీ బాయిని ఎంతో అందమయిన పాపగా వర్ణిస్తారు. ఆమె జోధ్పూర్ రాకుమార్తె కాబట్టి ఆమెని జోధా బాయి అని కూడ పిలిచేవారు. కొంతమంది చరిత్రకారులు అక్బర్ జోధాకి మేనమామ/బాబాయి వరస అని నమ్ముతారు.

ఆ పెళ్లితోనే మెదలయింది మొఘల్ రాజప్రాసాదాల్లో ఈ పాపని విచ్చలవిడిగా వాడేసుకునే ఒక హృదయవిదారకమైన గాథ. ఒక ఇరవయ్యేళ్లపా-

టు తన మామగారు, మేనమామ/బాబాయి వరసైన అక్బర్ కి ఉంపు-డుగత్తెగా ఉండిపోయిన ఆమె చివరికి 1605 లో ఆత్మహత్య చేసుకుంది.

## జోధా ఆత్మ హత్య ఎందుకు చేసుకుంది?

మాదకద్రవ్యాలకు బానిసైన 30 ఏళ్ల ఒక తండ్రి, అతని 16 ఏళ్ల కొడుకు తన పెళ్లైన రోజునుండి విచ్చలవిడిగా శారీరకంగా వాడుకున్నారీ పాపని.

ఆమె పెళ్లి ఒక బూటకం. కేవలం సంభోగం కోసమే తాత్కాలిక పెళ్లి చేసుకునే ఒక విచిత్ర ఆచారం సున్ని ముస్లింలలో ఉంది. దాని పేరే 'మిస్యర్'. షియా ముస్లింలలో కూడ ఇదే ఆచారం 'ముతాహ్' అనే పేరుతో ఉంది.

ఇంకా, ముస్లిమేతర స్త్రీలతో వివాహం చట్టబద్ధమైనదికాదు. ఆ స్త్రీ ఇస్లాం మతం స్వీకరించేంతవరకు ఆమె వేశ్యాబానిసగానే పరిగణింపబడుతుం-ది. ఖురాన్[4/3] ప్రకారం మగవాడు ఎంతమందినైనా వేశ్యాబానిసలని ఉంచుకోవచ్చు.

క్లుప్తంగా చెప్పాలంటే ఏరూపేణా అయినా లెక్కలేనంత మంది భార్యలని, వేశ్యాబానిసలని ఉంచుకోవచ్చు. అలా ఉంచుకున్న స్త్రీ కనుక ఇస్లాంలోకి మారకపోతే అసలు ఆమె విషయంలో ఎటువంటి నియమనిబంధనలూ ఉండవు.

కానీ ఆమె మతం మారినా కూడ, మగవాడు అసంఖ్యాకంగా భార్యల-నుంచుకోవచ్చు. ఇద్దరు కలిసి భర్త ఇంట్లో కాపురం లేనంతవరకు ఆ సం-బంధాన్ని ఎప్పుడైనా తెంచేసుకోవచ్చు. ఎందుకంటే అది మిస్యర్ క్రిందికి వస్తుంది. తాత్కాలిక వివాహాల్లో నలుగురే భార్యలుండాలన్న నియమం వర్తించదు.

అందుకని హిందువులు వారి కూతుళ్లని తమకిచ్చి పెళ్లి చేయాలని మొఘులులు (ఆ మాటకొస్తే ముస్లిం సుల్తానులందరూ) వత్తిడి చేసేవారు. పెళ్లి చేస్తే ఆ స్త్రీలకి ప్రత్యేక స్థానం కల్పిస్తామని, వారికింకా ప్రత్యేక ఏర్పాట్లు కూడ చేస్తామని హామీ ఇచ్చేవారు. వారి జిత్తులేంటంటే, ఈ స్త్రీలకి 'ప్ర-త్యేక స్థానం' కల్పిస్తే ఎవరూ వాళ్లని ఇస్లాం వ్యతిరేకులనరు. మూర్ఖులైన హిందు దేశ ద్రోహులు తమ కూతుళ్ల శీలాన్ని ఆ నీచులకి అమ్మకానికి పెడితే దానికి బదులుగా వారికి అనేక ప్రయోజనాలు చేకూరుతాయని ఆశ పడేవారు.

స్త్రీలు ఇస్లామ్ లోకి మారినా మారకపోయినా మొఘులులకి ఎటువంటి ఇబ్బంది లేదు. ఎందుకంటే సుల్తాను తనకి నచ్చినంత మందితో కులక-వచ్చు. ఇస్లాంలోకి మారడం స్త్రీకే అవసరం. మారితే సవతి పోరు తప్పక-పోయినా కనీసం ఒక బానిసలాగా కాక ఆమెకి, ఆమె సంతానానికి ప్రత్యేక హోదా అయినా దక్కుతుంది.

జోధాని మతం మారమని అక్బర్ ఒత్తిడి చేయలేదు. జోధా తన కోడ-లేనని మాన్ సింగ్ ని, అతని కుటుంబాన్ని మభ్యపెట్టాడు అక్బర్. ని-జానికామె ఒక వేశ్యా బానిసే. కాబట్టి తండ్రీ, కొడుకు ఇద్దరూ ఆమెతో పడకసుఖాన్ని పంచుకున్నా ఎటువంటి పాపం అంటుకోదు. తమ పవిత్ర గ్రంథం ప్రకారం కూడ ఒక వేశ్యాబానిస బ్రతికేదే తన యజమాని కోరికలు తీర్చడానికి కద! జహంగీర్ తన బూటకపు పెళ్లి నాటికి చిన్నవాడవడం-తో అతని ఆస్తులన్నిటిమీదా, ఆఖరికి అతని వేశ్యాబానిసలపైన కూడ, అక్బర్ దే కద పెత్తనం.

ఇది అర్థమైపోయిన జోధా ఇరవయ్యేళ్లపాటు ఈ నరకయాతనని అను-భవించింది. ఖుస్రో మిర్జా అనే యువరాజుకి కూడ జన్మనిచ్చింది కాని అతని తండ్రి అక్బర్, జహంగీర్లలో ఎవరనేది మాత్రం చర్చనీయాంశం. బహుశా డిఎన్ఏ పరీక్ష ఒక్కటే మార్గం.

ఈ వ్యవహారం రాచకుటుంబంలో పెద్ద చిచ్చు రేపింది. తండ్రీ కొడుకులి-ద్దరూ జోధా శీలాన్ని శంకించారు. జహంగీర్ తండ్రి మీద తిరగబడ్డాడు. ఆఖరికి మాన్ సింగ్ ని, అతని తండ్రిని కూడ చంపించాడు. ఈ చీకటి వ్య-వహారాలు బయటకి పొక్కి రాచకుటుంబం పరువు పోకుండా ఉండడం-కోసం కొన్ని రాజకీయ ఒప్పందాలు చేసుకుని గొడవలు సద్దుమణిగేలా చూశారు. కానీ అక్బర్, జహంగీర్ ఇద్దరు తమ పరువు కాపాడుకోవడం కోసం తన కొడుకుని దూరంగా పెట్టడంతో హతాశురాలైంది జోధా. ఇంతటి ఘోర అవమానాల్ని ఇక తట్టుకోలేక ఆత్మహత్యకి పాల్పడింది.

## అక్బర్ తన కామ దాహాన్ని తీర్చుకోడానికి పన్నిన మహాపన్నాగం - అసలు కథ ఎలా మొదలైంది

అక్బర్ 1582 లో 'దీన్-ఇ-ఇలాహీ' అనే ఒక కొత్త మతాన్ని స్థాపించి తన భట్రాజులని, అతని కొడుకుని కూడ దానిలో చేర్చుకున్నాడు.

అతని అసలు పేరు జలాలుద్దీన్ మొహమ్మద్. అతను అక్బర్ గా తన

పేరును మార్చుకోడానికి కారణం అల్లాని కూడ ఆ పేరుతో పిలవడమే. అతను తనని తాను మహిమలున్న ఒక ఆధ్యాత్మిక వ్యక్తిగా ప్రచారం చేసుకుని జనాన్ని పిచ్చివాళ్లని చేయడమే అతని పన్నాగం. అందుకే అతని ఎదురుగా అందరినీ 'అల్లా-ఒ-అక్బర్' అని అరవమనేవాడు.

తను అత్భుతాలను సృష్టించగలనని ప్రచారం చేసుకున్నాడు. బలవంతంగా అతని కాళ్లు కడిగించుకుని ఆ మురికి నీళ్లని త్రాగడానికి జనం బారులు తీరేలా చేయించాడు. కొంత మంది ఆ నీటిని త్రాగితే తమకు అనేక రోగాలు తగ్గాయని ప్రచారం చేశారు. ఇవన్నీ అతన్ని ప్రవక్తగా ప్రకటించడానికి చేసిన ప్రయత్నాలే.

**అసలు కథ**

ఇస్లాంకి దగ్గరగా ఉన్న కొత్త మతానికి ప్రవక్తగా ఉంటూ కేవలం ఒక ప్రవక్తకే దక్కవలసిన ప్రయోజనాలనేకం తనకు కూడ దక్కాలంటూ తన భట్రాజులని ఒప్పించసాగాడు.

కోడలిని పెళ్లి చేసుకోవాలన్నా, ఆమెతో సుఖించాలన్నా తనకే ఆ దివ్యమైన హక్కుంటుంది. మహమ్మద్ ప్రవక్త ఆత్మకథలో కూడ అతను తన కోడలిని పెళ్లి చేసుకున్నాడు. నగ్నంగా కనబడిన కోడలి అందాన్ని కాలదన్నుకోవద్దని అతనికి భగవంతుడు చెప్పాడట. పైగా ఆ పెళ్లి స్వర్గంలోనే జరిగిందని, అందుకే ఎవరూ చూడలేదని ఆ పుస్తకంలో ఉంటుంది. ఒక విధంగా చెప్పాలంటే అతను తన కోడలిని పెళ్లి చేసుకోకుండానే ఆమెతో పడుకున్నాడు.

ఇంకా, ఖురాన్ ప్రకారం, షాహి బుఖారి చెప్పినట్టు, ప్రవక్త ఆత్మకథల ప్రకారం కూడ అతనొక ఆరు సంవత్సరాల పాపను పెళ్లాడి, ఆమెకి తొమ్మిది సంవత్సరాలు వచ్చాక ఆమెతో సంభోగించాడు. భగవంతుడు చెప్పడం వల్లే అతనా పని చేశాడు.

అక్బర్ కూడ ప్రవక్త అయితే అతను కూడ ఇష్టం వచ్చినంత మందిని పెళ్లాడి వాళ్లతో సంభోగించవచ్చు. అతనికి ఎటువంటి ఆంక్షలు ఉండవు, మతపరమైన నమ్మకాలేవీ అడ్డురావు.

ఖురాన్ నుండి అనువదించుకున్న ఇటువంటి భావజాలం ఆధారంగానే ఇప్పుడు ఐసిస్, అల్ ఖయిదా వంటి ఉగ్ర సంస్థలు హత్యలకి, మానభం-

గాలకి తెగబడుతున్నాయి. మతాన్నడ్డు పెట్టుకుని తమ స్వప్రయోజ-నాల్నీ, కుతినీ తీర్చుకోవడమే లక్ష్యం అయినప్పుడు నిజమైన ఖురాన్ ఏమి చెప్తే వారికెందుకు, ప్రవక్త ఎమి చేసుంటే వారికెందుకు!

అందుకే 'దీన్-ఇ-ఇలాహి' ని, అతని తన మత మౌఢ్యాన్ని ఆసరాగా చేసుకుని జోధాని, ఇంకా అనేకమంది స్త్రీలని వాడుకున్నాడు అక్బర్. హిందువులని, ముస్లింలని సంతృప్తిపరచడానికి రెండు మతాలనీ వాడుకుని కొత్త అర్థాలను తీసేవాడు. దీంతో అటు తమ కూతుళ్లను అప్పగించడానికి హిందువులని, అతని వికృత చేష్ఠలు సమర్థించడానికి ముస్లింలని వాడుకుని ఇద్దరినీ పిచ్చివాళ్లని చేశాడు.

## జోధాని అక్బర్ చెరపట్టినా ఎందుకు సుఖపడలేకపోయాడు?

అక్బర్ అనేకమార్లు తన వికృతమైన ప్రణాలికలో విఫలమయ్యాడు. స్త్రీ-లోలత్వం, అతిగా మాదకద్రవ్యాలు సేవించడం వల్ల అతను స్వాధీనంలో ఉండేవాడు కాదు. నలభై మందికి పైగా భార్యలు, 5000 కు మించి వేశ్యా బానిసలూ ఉన్నా అతని కుతి రోజురోజుకి పెరిగిందే కానీ తగ్గలేదు. అతని వికృత చేష్ఠలు బహిర్గతమయ్యాయి. దాంతో ప్రవక్త, అతని కోడలు మధ్య సంబంధంలాగే అక్బర్ భట్రాజులు జోధా, అక్బర్ల ప్రేమ కథని సృష్టించారు.

ఈ వార్త విన్న పదహారేళ్ల జహంగీర్ తండ్రిపై తిరగబడ్డాడు. జహంగీర్ నుండి వ్యతిరేకత ఎక్కువైతే ప్రవక్తకి అతని కోడలితో ఉన్న సంబంధా-న్నీ, అతనికి చిన్న పిల్లలతో ఉన్న శారీరక సంబంధాలను ఉదాహరణ-గా చూపించి తప్పించుకోవచ్చనుకున్నాడు అక్బర్. కానీ జహంగీర్ ఒక నిజమైన ముస్లిం కాదు. అతనికి తన శారీరక సుఖాలు, అహం తప్ప మరేమీ పట్టేది కాదు. అతను తండ్రిలాగే మరో వికృత స్వభావుడు. అతను కూడ అనేకమంది భార్యలు, ఉంపుడుగత్తెలను ఉంచుకునేవాడు. ఈ జోధా అక్బర్ సంఘటనతో జహంగీర్ అహం దెబ్బతిన్నది. అతను ఎదురుతిరిగి అక్బర్ అనుచరులని చంపేశాడు. తన పెద్ద కొడుకు తన తండ్రికి, తన భార్య/వేశ్యాబానిసల అక్రమ సంతానం అనే విషయాన్ని జీర్ణించుకోలేకపోయాడు. ఈ తండ్రీకొడుకుల వైరం అక్బర్ అనుచరుల-ను చంపడంతో ఆగకుండా ఖుస్రోని జహంగీర్ జీవితాంతం ద్వేషించేలా చేసింది.

అతని తండ్రి, భార్యలు మరణించి రెండు సంవత్సరాలు తిరక్కుండానే

ఖుస్రోని తన స్వహస్తాలతో గుడ్డివాణ్ణి చేసి చెరసాలలో వేసి బంధించాడు జహంగీర్. తరువాత ఒక 15 సంవత్సరాలకి జహంగీర్, అతని కొడుకు షాజహాన్ లు కలిసి ఖుస్రోని కౄరంగా చంపేశారు.

అతని సవతి తమ్ముడు/కొడుకు అయిన ఖుస్రో మీద జహంగీర్ కి ఎంతటి ద్వేషముండేదంటే ఖుస్రోని గుడ్డివాణ్ణి చేయడం, అతని అనుచరులని చంపడం అన్నీ బహిరంగంగానే చేశాడు. అతన్ని ఒక ఏనుగు మీద ఎక్కించి, ఆ ఏనుగు పక్కలకి బల్లలు కట్టించి ఆ బల్లలమీద అతని అనుచరుల్ని కట్టేసి ఊరేగించాడు. ఆ ఊరేగింపులో వాళ్లని హలాల్ పద్ధతిలో గొంతు కోసి మెల్లగా రక్తం కారిపోయి బాధాకరంగా చనిపోయేలా చేశాడు. అలా ఒక 400 మంది అనుచరుల్ని చంపించాడు. జహంగీర్ స్వయంగా అతని వేళ్లతో ఖుస్రో కళ్లను పొడిచేసి కనుగుడ్లను పెకిలించాడు. అంతటి కౄరత్వాన్ని మీరు ఊహించగలరా! అక్బర్ అభిమానులు మతం పేరిట కుక్కపిల్లల్ని మంటల్లో కాల్చడం, చిన్న పిల్లల్ని నరికిచంపడం చేస్తున్నారంటే ఇంక ఆశ్చర్యం ఏముంటుంది !

జోధా పరిస్థితులని ముందుగానే అంచనా వేయగలిగింది కాబట్టే విషం మ్రింగి చనిపోయింది.

తనకి తరుగుతున్న రాజకీయ పలుకుబడి, జహంగీర్ కి పెరుగుతున్న ఆదరణ చూసి జాగ్రత్త పడిన అక్బర్ అతనికి క్షమాపణ చెప్పి ఒక ఒప్పందం కుదుర్చుకున్నాడు. వీళ్లకి సంధి కుదిర్చింది వీళ్ల అక్రమ సంబంధాలు, చీకటి వ్యవహారాలు పూర్తిగా తెలిసిన రాచకుటుంబ స్త్రీలే. ఈ ఒప్పందం ప్రకారం అక్బర్ రాజ్యానికి జహంగీర్ వారసుడౌతాడు, ఖుస్రో ప్రాణాలను జహంగీర్ తీయకుండా ఉంటాడు. అక్బర్ ఖుస్రోని తన సొంత కొడుకుగానే భావించేవాడు. కానీ అక్బర్ చనిపోయినతరువాత తనిచ్చిన మాట తప్పాడు జహంగీర్. ఖుస్రోని గుడ్డివాణ్ణి చేయడమేకాకుండా చంపేశాడు కూడ. మొఘలులు వాళ్ల ప్రేమికులు ఎవరూ కూడ తమ సొంతవారి పట్లే నమ్మకంగా లేరు. ఇంక హిందువులని, హిందూ మతాన్ని కాపాడతారని ఎలా నమ్ముతాం?

తనని తాను సాధువుగా చూపించుకోవడం కోసం కామ మోహాలకి 'దీన్-ఇ-ఇలాహి' లో స్థానం లేదని చెప్పేవాడు అక్బర్. బ్రహ్మచర్యాన్ని స్తుతిస్తూ పాటలు పాడేవాడు. ప్రవక్తగా తనని తాను మాత్రం మినహాయించుకోగలిగాడేమోకానీ 13 ఏళ్ల వయసులో జహంగీర్ ని మోసం

చేసినట్టు జనాన్ని మోసం చేయలేకపోయాడు అక్బర్. ఇతరులకి బ్ర-హ్మచర్యం పాటించమని సూక్తులు చెప్తూ అక్బర్ మాత్రం 5,000 మంది ఉంపుడుగత్తెలను ఉంచుకుంటూ, పైగా తన భార్య జోధాని మానభంగం చేస్తున్నాడని తెలుసుకున్న జహంగీర్ తాను ఘోరంగా మోసపోయానని తెలుసుకున్నాడు.

తరువాత జరిగిందంతా చరిత్ర. జహంగీర్ తిరుగుబాటు చేయడం, అతని సవతి తమ్ముడు, కొడుకు అయిన ఖుస్రోని గుడ్డి వాడిగా చేసి చంపడం, ఆ తరువాత జరిగిన మారణకాండ నేటి వరకు ఆగకపోవడం వగైరా అన్నీ. అతని వంశస్థులు ఈనాడు బారాబంకీ రైల్వే స్టేషనులో జామపళ్లు అమ్ముకుంటున్నారు. ఓ రాజ కుటుంబం పగలతో, పంతాలతో, వికృత స్వభావాలతో ఆ స్థాయికి దిగజారిపోయింది.

కానీ ఈ కథ అంతటికీ అత్యంత విషాదకరమైన విషయమేంటంటే ఒక చిన్నారి జీవితాన్ని మొత్తం వాళ్ల వికృత కోర్కెలకోసం బలిచేసారు. చివరికి ఆమె జీవితం చాలించింది. అదీ జోధా-అక్బర్ల వెనకున్న కథ, వ్యధ.

## సారాంశం

పైన చెప్పిన విషయాలేవీ సినిమాలు, సీరియళ్లలో చూపించే కట్టు కథలు కావు. ఇవన్నీ మొఘలుల రాజప్రాసాదాల్లో నిజంగా జరిగిన చీకటి గాథలు. నేడు మతాన్నడ్డు పెట్టుకుని అమాయకుల్ని మానభంగాలూ, హత్యలు చేస్తున్న ఐసిస్ ఉగ్రవాదులు, బాఘ్దాదీలకు, ఆనాటి మొఘ-లులకు పెద్ద తేడా ఏమీలేదు. నిజానికి వీరికంటే మొఘలులే ఇంకా దు-ర్మార్గులు.

జోధా-అక్బర్ కథలో ఏదన్నా నిజం ఉందీ అంటే అది కామం కోసం కూతుర్ని విచ్చలవిడిగా వాడుకున్న ఒక తండ్రి కథ అనేదే.

ఈ సభ్య సమాజంలో ఒక కోడలు కూడ కూతురులాంటిదే. ఒక స్నే-హితుడి కోడలు, లేదా ఒక బంధువుకి కోడలు కూడ కూతురువంటిదే. అంతెందుకు, ఒకరి కోడలు ఆ ఊరివారందరికి కూతురు వంటిదే. వికృత స్వభావులే ప్రవక్త వంటివాడికి కూడ కోడలితో సంబంధం అంటగట్టారు. వారి ప్రవక్తలకే రంకు అంటగట్టిన వాళ్లు మిగతావారి పట్ల ఎలా ప్రవర్తిస్తారో మీరూహించవచ్చు.

ఇది కేవలం గతం మాత్రమే కాదు. వర్తమానం కూడ. అక్బర్ వంటి ఉగ్ర-వాదులనీ, కామ పిశాచులనీ ఆరాధించేవారు ముస్లిమేతరులని చెరచడం అనే హేయమైన చర్యలకు ఈనాటికీ పాల్పడుతూనే ఉన్నారు. మొఘలుల చరిత్రకారులు, భట్రాజులు వాళ్ల కౄరత్వాన్ని వివరిస్తూ, వాళ్లు చేసిన హత్యలు, తలలు నరకడం, కళ్లు పీకేయడం, ప్రవక్త ముసుగులో వేల కొద్దీ స్త్రీలను మానభంగాలు చేయడం వంటి నీచమైన పనులను గొప్పగా వివరిస్తుంటే మన చరిత్రకారులు కూడ వాళ్లని గొప్పవాళ్లుగా పరిగణించ-డం హాస్యాస్పదం, సిగ్గులేనితనం.

ఈ అధ్యాయంలో చెప్పిన విషయాలేవైనా తప్పనుకున్నా, లేదా ఇస్లామ్ కి వ్యతిరేకం అనుకున్నా ముస్లిం పండితులకి మా బహిరంగ సవాల్ - తమ కోడలిని (స్వంత, దత్తత తీసుకున్న, దూరపు బంధుత్వం ఉన్న స్త్రీ, లేదా అసలు సంబంధమే లేకపోయినా) తామే తిరిగి పెళ్లి చేసుకోవడం లేదా శారీరకంగా అనుభవించడం ఒక హేయమైన చర్య అని, అలా చేసిన వారికి దేహశుద్ధి చేయాలని, వారిని అత్యంత వికృత స్వభావులుగా భా-వించాలని చెప్పి బహిరంగంగా ప్రకటించండి అక్బర్ ని సమర్థించేవారెవ-రైనా సరే.

అసత్యమైన హదిత్ లు, ఖురాన్ పద్యాలను నిర్లజ్జగా ఉటంకిస్తూ ఆరా-ధ్యుడైన ముహమ్మద్ ప్రవక్త కూడ అటువంటి నీచమైన పనులకు పా-ల్పడ్డాడని అసత్య ప్రచారం చేసేవారు మానవత్వానికి, ఇస్లాంకి శత్రువు-లని ప్రకటించండి. ఒక గొప్ప వ్యక్తిని కించపరిచినందుకు అటువంటివారిని కఠినంగా శిక్షించండి. ఆ మూర్ఖులకి ఇస్లాం గురించి ఏమీ తెలియదు. వారు పవిత్ర గ్రంథాలు అనువాదించడాన్ని నిషేధించాలి.

మనమే కనుక తెలివిగలవాళ్లం, విలువలకి కట్టుబడి ఉండే వాళ్లం, హే-తువాదులం అయితే ఎవడో మూర్ఖుడు మన పాఠ్య పుస్తకాల్లో వ్రాసిన హాస్యాస్పదమైన విషయాల్ని చదివి ఇటువంటి వికృత స్వభావులని, ఉగ్రవాదులని ఆరాధ్యులుగా పరిగణించం. వాళ్ల వోటు బ్యాంకు రాజకీ-యాలకోసం వాళ్లు వ్రాసుకున్నారు. కానీ మనకేం ఖర్మ పట్టింది వారిని సమర్థించడానికి? మన మూర్ఖత్వమే ఈనాడు ఉగ్రవాదులకు బలాన్ని చేకూర్చి ప్రపంచాన్ని ముప్పతిప్పలు పెడుతుంది. మీరు దుష్టులని ఆరాధిస్తే దుష్టులే పుట్టుకువస్తారు.

స్వంత తండ్రి ద్రోహానికి, ఓ ఇద్దరు కామపిశాచుల దాహానికి బలైపోయిన

అమాయకురాలు జోధా. ఆ ఇద్దరు కామపిశాచుల్లో ఒకడు తండ్రిలా కా-
పాడాల్సింది పోయి విటుడిలా ప్రవర్తించాడు. మరొకడు అక్కున చేర్చు-
కునే భర్తగా ఉండాల్సింది పోయి తన కామాన్ని తీర్చుకునే కసాయిగా
ఉండిపోయాడు.

జోధాకి ఎదురైన ఘోరమైన పరిస్థితులే ఈ రోజు యజీదీ స్త్రీలు, లవ్ జిహాద్
బాధిత మహిళలు ఎదుర్కొంటున్నారు. అటువంటి ఓ చీకటి గాథను ప్రే-
మకావ్యంగా చూపించాలనుకోవడం అసలు స్త్రీ జాతికే అవమానం.

# 6

# షాజహాన్ - కూతురితో వ్యభిచర్యం

షాజహాన్ - ఒక గొప్ప మొఘల్ - తాతకు పుట్టిన ఒక అక్రమ సంతానం. అతను కూడ తక్కువవాడేం కాదు. భార్య కంటే కూతురే అందంగా ఉందని కూతురితో పడుకున్న వాడు. చనిపోయిన భార్య జ్ఞాపకార్థం తాజ్ మహల్ కట్టిస్తున్నాడని ప్రపంచం నమ్ముతుండగా తను మాత్రం భార్య ద్వారా పొందిన 'ప్రేమ ఫలాన్ని' తనే రుచి చూసేసాడు.

షాజహాన్ తన పూర్వీకులకీ, తరువాతి తరంవారికీ భిన్నమైనవాడేమీకా-దు. వీళ్లలో ప్రతి ఒక్కరు తమ వికృత కోర్కెలను తీర్చుకోవడం కోసం కొత్త దార్లు వెతికినవారే. బాబర్, అక్బర్, హుమయూన్, జహంగీర్, ఔరంగజే-బ్, బహదూర్ షా జఫర్ ఇలా ప్రతి ఒక్కరు.

బాబర్ మగ పిల్లలతో సంభోగించడంలో సిద్ధహస్తుడు. బాబ్రీ మస్జిద్ అతని వికృత చేష్ఠలకి నిలువెత్తు నిదర్శనం.

హుమయూన్ తన కామకేళిని బాల్యంలోనే మొదలు పెట్టాడు. భార్యగా

కొనుక్కున్న ఒక స్త్రీ ద్వారా అక్బర్ ని తన చిన్నతనంలోనే కన్నాడు హుమయూన్.

అక్బర్ వికృత కోర్కెల్లో వీళ్లందర్నీ మించిపోయాడు. ప్రవక్త ముసుగులో ఎవరినిపడితే వారిని విచ్చలవిడిగా అనుభవించడం కోసం ఏకంగా ఒక కొత్త మతాన్నే స్థాపించాడు. అతనికి 5,000 కు పైగా ఉంపుడుగత్తెలతో నిండిన అంతఃపురం (వేశ్యావాటిక) ఉండేది. అతనికి చిన్న పిల్లలమీద కోర్కె అధికంగా ఉండేది. అతను చివరికి సొంత కోడలు జోధా బాయి (జహాంగీర్ భార్య) ని కూడ వదల్లేదు.

## షాజహాన్ - ఒక అక్రమ సంతానం

5,000 మంది స్త్రీలున్న వేశ్యావాటికలో ఎవరి తల్లి ఎవరో, ఎవరి పిల్లలకి తండ్రి ఎవరో చెప్పడం కష్టం. అందుకే ఏ రాకుమారుడు ఎవరికి పుట్టాడనే విషయంలో పరస్పర విరుద్ధమైన ఆధారాలుంటాయి చరిత్రలో. చివరికి ఏది అధికారికంగా ప్రకటించారో దాన్నే చరిత్రకారులు నమ్మే పరిస్థితి ఏర్పడింది.

తమ హరెం లలో స్త్రీల శీలాన్ని కాపాడడం కోసం నపుంసకులని, స్త్రీల-ని కాపలాదార్లుగా ఉంచుకునేవారు మొఘల్ సుల్తానులు. కానీ సుల్తాను కొడుకు ఉంచుకున్న వేశ్యలను సుల్తాను అనుభవించకుండా అడ్డుకోగ-లిగేదెవరు!

దైవభీతి ఉన్న ముస్లింలెవరైనా స్వంత కోడలిని చెరచడం నీచమని, ఇస్లాంకి వ్యతిరేకం అని నమ్ముతారు. కానీ, 'దీన్-ఇ-ఇలాహీ ప్రవక్త' అక్బర్ కి మాత్రం మతాన్ని తనకు నచ్చిన విధంగా అన్వయించుకుని తనకు నచ్చిన నియమాలు సృష్టించుకునే దివ్య శక్తి ఉంటుంది.

జహాంగీర్ ని యుద్ధాలకి పంపించి, అతను లేని సమయంలో అతని భార్యలను (స్వంత కోడళ్లు) అనుభవించేవాడు అక్బర్. ఈ విషయాన్ని తెలుసుకున్న జహాంగీర్ ఎదురు తిరిగాడు. తన కొడుకు నిజానికి తన తమ్ముడేనని తెలుసుకుని అతన్ని చంపేశాడు జహాంగీర్.

జహాంగీర్ కి తన ఇతర కొడుకులందరి పుట్టుక, ఆఖరికి ఖుర్రమ్ పుట్టుక కూడ, అనుమానాస్పదమే. దీనికి బహుశా డిఎన్ఏ పరీక్ష కూడ పనిచే-యదేమో. దీంతో తన జీవితాంతం తన సంతానంతో గొడవలు పడుతూనే

ఉన్నాడు జహంగీర్.

## అక్బర్ - షా జహాన్ కి నిజమైన తండ్రి

షా జహాన్ ని జహంగీర్ ద్వేషిస్తుండగా అక్బర్ మాత్రం అతన్ని అమితంగా ప్రేమించేవాడు. ఒక దశలో షా జహాన్ని తరువాతి సుల్తాన్ గా కూడ ప్రకటించాలనుకున్నాడు అక్బర్.

షా జహాన్ తల్లి ఎవరనే విషయంలో ఎన్నో అనుమానాలున్నాయి. జోధా బాయి అని కొందరు, జగత్ గోసియాని అని మరికొందరు అంటారు. ఇంకొందరు వేరే పేర్లు చెప్తారు. ఈ సందిగ్ధత ప్రతి మొఘల్ చక్రవర్తి, రాకుమారుడి విషయంలోను ఉంటుంది - బాబర్ నుండి బహదూర్ షా జఫర్ వరకు ప్రతి ఒక్కరి విషయంలో. అతని తల్లెవరైనప్పటికీ, అక్బర్ కామానికి మాత్రం ఆమె మినహాయింపు కాదు.

జహంగీర్ తన తండ్రిని, కొడుకులనీ కూడ ద్వేషిచాడనేది చరిత్ర చెప్పిన సత్యం. అలాగే అక్బర్ కి అతని 'అధికారిక' మనుమలమీద ప్రేమ కూడ. అలాగే, జహంగీర్ భార్యలలో ఒకరు ఆత్మహత్య చేసుకున్నారనేది కూడ చరిత్ర చెప్పిన సత్యం. లేదంటే, బహుశా జహంగీరే ఆమెని చంపి ఉంటాడు.

## నిజంగా జహంగీరే అయుంటాడా?

షా జహాన్ తనకి కొడుకా, తమ్ముడా అనే మీమాంసని తన జీవితాంతం ఛేదించలేకపోయాడు జహంగీర్. దాని ఫలితమే అతనికి, షా జహాన్ కి మధ్య ఉన్న సంబంధం ప్రేమ-ద్వేషాలతో నిండి ఉంటుంది. జహంగీర్ చివరి రోజుల్లో షా జహాన్ అతనిపై తిరుగుబాటు చేసి సింహాసనాన్ని ఆక్రమించాడు. అతని సవతి తల్లి నూర్ జహాన్ని ఖైదు చేశాడు. అతని తండ్రి, తాత కూడ అయిన అక్బర్ ది గ్రేట్ నుండి విశృంఖలత్వాన్ని పుణికిపుచ్చుకున్నాడు.

## షా జహాన్ - కూతురిపై కామం

ముంతాజ్ మహల్ పై తనకున్న ప్రేమకు చిహ్నంగా షా జహాన్ తాజ్ మహల్ని కట్టించాడని ప్రచారం చేస్తూ తీసిన కొన్ని బాలీవుడ్ సినిమాలు తప్ప షా జహాన్ కి ముంతాజ్ మీద అమితమైన వాత్సల్యం ఉన్నట్టు కనిపించే ఆధారాలేవీ మనకు కనపడవు. షా జహాన్ కి, ముంతాజ్

మహల్ (అర్జుమంద్ బాను బేగం) కి 1607 లో నిశ్చితార్థం జరిగింది. తరువాత ఇరాన్ రాకుమార్తెను 1610 లో వివాహం చేసుకున్నాడు. వీరిద్దరికీ ఒక కూతురు పుట్టిన తరువాత చివరికి 1612 లో, అంటే నిశ్చితార్థం అయిన అయిదు సంవత్సరాల తరువాత, ముంతాజ్ ని పెళ్లి చేసుకోవాలని నిర్ణయించుకున్నాడు షా జహాన్.

ముంతాజ్ మహల్ ద్వారా 13 మంది సంతానాన్ని కన్నాడు షా జహాన్. ఆగ్రాకి వెయ్యి కిలోమీటర్ల దూరంలో ఉన్న బుర్హన్పూర్ లో తన 14వ సంతానానికి జన్మనిస్తూ కన్ను మూసింది ముంతాజ్. ఇదిలా ఉండగా షా జహాన్ ఆరేడుగురు స్త్రీలని పెళ్లి చేసుకోవడమేకాకుండా, మరో 5,000 మందితో ఒక హరెం ని ఏర్పరుచుకున్నాడు. ఆమె మరణించిన తరువాత కూడ అతని పెళ్లిళ్లు, హరెం విస్తరణ నిరాఘాటంగా సాగించాడు. ఎంతైనా వాళ్లది అమర ప్రేమ కద!

## ముంతాజ్ మహల్ మరణం తరువాత నాటకీయ పరిణామాలు

ముంతాజ్ మరణించిన దుఃఖంతో తను పిచ్చివాడైనట్లు నటించాడు షా జహాన్. ఆ 'బాధని దిగమ్రింగడానికి' లెక్కలేనంత మంది వేశ్యాబానిసలతో పడుకునే వాడు. అతని హరెంని ఇంకొంత మంది స్త్రీలతో విస్తరించేవాడు. కానీ, ఇవేవీ పని చేయలేదు.

ముంతాజ్ మహల్ మరణించేనాటికి అతని కూతురు జహాన్ అరా కి 17 ఏళ్లు. ఆమె అచ్చు ముంతాజ్ ని పోలి ఉండేది. చరిత్రకారులు, యూరోపియన్ యాత్రీకుల ప్రకారం ఆమె అందమైన ముఖంతో, రూప లావణ్యం కలిగిన ఒక సౌందర్య రాశి. షా జహాన్ ఆమెలో ముంతాజ్ ని చూసేవాడని చెప్తారు.

దాంతో, ఆమెని అనుభవించడానికి అతనికి ఓ అద్భుతమైన సాకు దొరికింది. తను నాటిన చెట్ల ఫలాల్ని తోటమాలే ఎందుకు ఆస్వాదించకూడదు అనే వాదనని లేవనెత్తాడు. ప్రపంచంలో ప్రతి వికృత స్వభావుడికి ఇది ఓ తిరుగులేని నినాదమవుతుంది.

తల్లి మరణంతో సంభవించిన దుఃఖాన్ని ఉపశంమింపజేసే బాధ్యతని పెళ్లీడు వచ్చిన కూతురు జహాన్ అరా పై పెట్టాడు షా జహాన్. అంతేకాక తనతో తప్ప మరే ఇతర మగాడితోనూ జహాన్ అరా మాట్లాడకుండ చూసుకున్నాడు షా జహాన్. ఎవరైనా మాట్లాడే ధైర్యం చేస్తే వాళ్లు అతని

చేతిలో హతమయ్యేవారు.

జహాన్ అరా ని తన హరెం ప్రధానాధికారిణి గా నియమించాడు. భార్య చనిపోయిన రెండేళ్లకి కానీ అతనికి దుఃఖం తీరలేదు. కానీ ఈలోగా అతని కబంధ హస్తాల్లో చిక్కుకుపోయింది జహాన్ అరా.

## కూతురి స్నేహితులను చంపాడు

జహాన్ అరా ఒక ఉదారవాది. మద్యం సేవిస్తూ యోగ్యులైన యువకులతో రాత్రుళ్లు గడిపేది. అలాంటి ఒక సందర్భం షా జహాన్ దృష్టికి రావడంతో రాత్రి వేళ వాళ్లున్న గదికి వెళ్లాడు. భయపడిపోయిన యువకుడు స్నానాల గదిలో దాక్కున్నాడు. షా జహాన్ అతన్ని చంపమని తన నపుంసక బానిసలను ఆదేశించాడు.

మరొక సందర్భంలో తన కూతురికి ప్రేమ ప్రతిపాదించిన వ్యక్తిని తన దర్బారుకి పిలిపించి ఆలింగనం చేసుకుని అతనికి పాన్ ఇచ్చాడు. దర్బారు ద్వారం దాటకుండానే అతను కుప్పకూలి చనిపోయాడు.

## నిస్సహాయి జహాన్ అరా

జహాన్ అరా రజస్వల అయ్యేనాటికి ఆమెకి అర్థమైన విషయం ఏమిటంటే తన మనుగడ కోసం తన తండ్రికి సన్నిహితంగా ఉంటూ అతని అవస-రాలు తీర్చడం తప్ప ఆమెకి మరొక మార్గం లేదని. తరువాతి చక్రవర్తి ఎవరనే విషయంగా జహాన్ అరా సోదరులు నలుగురి మధ్య చతుష్ముఖ పోరు మెదలయింది. షా జహాన్ కబంధ హస్తాలనుండి తప్పించుకోడానికి తన సోదరులందరిలో కాస్త ఉదారంగా ఉండే దారా సిఖోహ్ పక్షాన ఆమె నిలిచింది. కానీ ఔరంగజేబ్ అతన్ని చంపేశాడు.

చివరికి తండ్రి షా జహాన్ తో పాటు ఆమె కూడ ఖైదు చేయబడింది. షా జహాన్ కి తగిన శాస్తి జరిగింది. కానీ జహాన్ అరా కి మాత్రం విముక్తి కల-గలేదు. తండ్రికి ఓదార్పునివ్వడానికి అతనికి భార్యగా ఉంటూ ముంతాజ్ మహల్ ని మరపించే బాధ్యత ఆమెకే మిగిలిపోయింది.

## తరువాతి పరిణామాలు

షా జహాన్ మరణం తరువాత ఏదో ఒకటి చేయకుంటే తను చావడం

ఖాయమని తెలుసు జహాన్ అరా కి. అందుకే విధికి తల వంచి ఔరంగ-జేబ్ కామాగ్నికి ఆహుతయ్యింది. తండ్రి వాడుకోగా లేనిది అన్నని అడ్డు-కుని చచ్చిపోవడం పిచ్చితనమని భావించింది. ఏదేమైనా, పెళ్లీడు దాటి-పోయిన తనకి తగిన వరుడు కూడ ఎక్కడ దొరుకుతాడు?

ఔరంగజేబ్ తో 'రాజీపడింది'. కానీ సంశయుడైన ఔరంగజేబ్ ఆమె విధే-యతని బాగా 'పరీక్షించాడు'. దారా సిఖోహ్ పక్షాన నిలిచిందని తెలిసి-నప్పటికీ ఆమెని అతిగా నమ్మిన ఔరంగజేబ్ అతని తండ్రిలాగే ఆమెని తన వేశ్యావాటికకి ప్రధానాధికారిణిగా నియమించుకున్నాడు. ఇప్పుడు మొఘల్ చరిత్రలోకెల్లా పెద్ద వేశ్యావాటికని ఆజమాయిషీ చేయడం, తన అన్న మెచ్చిన స్త్రీలను అతనికి అందించడం ఆమె బాధ్యత అయింది.

ఔరంగజేబ్ ఆమెని ప్రత్యేక మందిరంలో ఉండనిచ్చేవాడు. తనకి నచ్చిన-ప్పుడు రావడం, లేదా ఆమెని పిలిపించుకోవడం చేసేవాడు.

జహాన్ అరా విధికి తలవంచి, తన శరీరాన్ని ఒక కళేబరంగా భావించి ఆధ్యాత్మిక జీవితంలోకి అడుగు పెట్టడమే శరణ్యం.

ఆమె అపురూప సౌందర్యరాశి అయినా పెళ్లి చేసుకోలేదు. ఆమెకి అధికా-రికంగా సంతానం కూడ లేదు.

మొహమ్మద్ అనే ఒక భారతీయ రాజకీయ నాయకుడు "తండ్రి కూతురిని మానభంగం చేయడం మామూలే కద" అన్నప్పుడు మనకి జహాన్ అరా నే జ్ఞాపకం వస్తుంది. ఇంకా తరతరాలుగా జహాన్ అరా లాగా తండ్రుల కామానికి ఆహుతైన కూతుళ్లు కూడ జ్ఞాపకం వస్తారు. వాళ్లు ఇంకా తండ్రులు, సోదరుల వికృత కోర్కెలకు బలి అయిపోతూనే ఉన్నారు. అది వారి ఖర్మ.

కానీ మనం ఇవన్నీ చూస్తూ మౌనంగా ఉండిపోవడమేనా? అది మొఘల్ చక్రవర్తుల బంగారు పాలనకు నిదర్శనమని అనుకుని మిన్నకుండిపో-తామా?

# 7

# ఔరంగజేబ్ - ఓ క్రూర నియంత

అబ్బురపరచే కట్టుకథలను మనం పక్కనపెట్టి నిజాలని నిక్కచ్చిగా మాట్లాడుకుంటే బాబర్ నుండి ఔరంగజేబ్ వరకు ప్రతి ఒక్కరు ఒసామా బిన్ లాడెన్ (అల్ ఖాయిదా అధినేత), బాఘ్దాది (ఐసిస్ అధినేత), ముల్లా ఒమర్ (తాలిబాన్ అధినేత)లకు ఏమాత్రం తీసిపోనివారే. ఈ ఆధునిక ఉగ్ర సంస్థలు తగినంతకాలం తమ పట్టు నిలుపుకోగలిగితే వారి పట్టున్న ప్రాంతంలో పాఠ్య పుస్తకాలు కూడ ఈ నీచులని వీరులుగా చిత్రిస్తాయి. వాళ్లు చనిపోయిన చాలా కాలం వరకు వీధులకి వాళ్ల పేర్లు నిలిచిపోతాయి. ఆ 'ఆదర్శనీయులకి' ఏమాత్రం అవమానం జరిగినా ఈ భావజాలానికి బందీలయిన వెర్రివాళ్లు తీవ్రంగా వ్యతిరేకిస్తారు. ఎందుకంటే వీళ్ల మనసులు చిన్నప్పటినుండి కలుషితం చేయబడ్డాయి. తమ ఆదర్శమూర్తులకి కొద్దిపాటి అవమానం జరుగుతుందని అనిపించినా వారి మనసులు విపరీతంగా కష్టపడేలా వీళ్లని తయారు చేస్తుంది వ్యవస్థ.

అదృష్టవశాత్తు భారతదేశం ఈ మానసిక దాస్యం నుండి విముక్తి పొందే ప్రయత్నాలు చేస్తూ ఉంది. ఔరంగజేబ్ రోడ్డు నుండి అబ్దుల్ కలాం రోడ్డుగా

పేరు మార్చారు. చరిత్రలోనే అతిపెద్ద ఉగ్రవాది పేరును ఒక వీధికి పెట్టుకుని తరతరాలుగా భరిస్తున్న అవమానభారాన్ని పోగొట్టుకోడానికి ఆ పేరుని మార్చి, తన జీవితాంతం ఉగ్రవాదానికి వ్యతిరేకంగా పోరాడిన ఒక వీరుని పేరును ఆ వీధికి పెట్టుకున్నాం.

కానీ ఇంకా చాలా మంది మానసిక దాస్యంలోనే ఉండి తలవంచుకు బ్రతుకుతున్నారు. ఒక ఉగ్రవాది పేరును మార్చి ఒక వీరుని పేరు పెట్టడం వారి దృష్టిలో 'దురదృష్టకరం, చరిత్రను భ్రష్టు పట్టించడం'. ఎందుకంటే వారి దృష్టిలో ఔరంగజేబే నిజమైన వీరుడు. వీళ్ల స్వంత కుటుంబ సభ్యులనే మానభంగాలు, హత్యలు, దోపిడీలకు గురిచేసిన వాడి పేరు ఆ వీధికి పెట్టినట్టయితే వీళ్ల అభిప్రాయాలెలా ఉండి ఉండేవో !

భారతదేశాన్ని స్వంత తల్లిలా, అమాయక భారతీయులని స్వంత కుటుంబ సభ్యులుగా పరిగణించే నావంటి వారికి ఈ బొద్దింక మనస్తత్వం ఎప్పటికీ అర్థం కాదు.

నిజానికి బొద్దింకలు బహు గొప్ప జీవులు. అవి ఎలాంటి వాతావరణంలో అయినా పోరాడి జీవిస్తాయి. కొన్ని వేల సంవత్సరాల నుండి ఈ భూమి మీద అవి నివసిస్తున్నాయి. బహుశా ఎప్పటికీ అంతరించిపోవు కూడ. మాంసం, మిఠాయిలు, మలం - ఇలా ఏదైనా తిని బ్రతికేస్తాయి. నిండు గోధుమ రంగులో ఉండి సున్నితమైన స్పర్శశృంగాలు కలిగి ఉంటుంది. దాని నున్నని రెక్కలతో దేని మీదకైనా ఎగిరిపోయి వాలగలదు, దాని నాజూకైన కాళ్లతో ఎక్కడికైనా పాకగలదు. అవి చీకటి ప్రపంచాన్ని ఏలేస్తాయి. కఠినమైన ఉష్ణోగ్రతలు, ఆకలి, పురుగుమందులూ - సమస్య ఏదైనా సరే అవి తట్టుకుని నిలబడతాయి, ఆ పరిస్థితులకి ఇట్టే ఇమిడిపోతాయి. ఎంతో గొప్ప అదృష్టవంతులే బొద్దింక అవగలుగుతారు.

మన స్వాతంత్ర్య సమరయోధులు బొద్దింక మనస్తత్వానికి పూర్తి వ్యతిరేకులు. వాళ్లు తమ ఆదర్శాలకోసం, లక్ష్యం కోసం తమ ఆనందాల్నీ, కుటుంబాలనీ, జీవితాలనీ కూడ త్యాగం చేశారు. ఎలాగోలా బ్రతికి బట్ట కట్టడం అనేది వారి రక్తంలోనే లేదు. దురాక్రమణదారుల ఆగడాలను వారు ఎదుర్కొన్నారు. మానభంగాలు, హత్యలను వారు సహించలేదు.

బొద్దింకలు మాత్రం బ్రతకడానికి ఏ మార్గాన్నైనా ఎంచుకుంటాయి. బాంబులు పేల్చి జనాన్ని చంపే ఒక ఉగ్రవాది శవ యాత్ర వెనక అవి

ఉంటాయి. నరహంతకులనీ, దురాక్రమణదారులనీ అవి ఆకాశానికెత్తేస్తాయి. ఉగ్రవాదిలో ఓ వీరుణ్ణి చూస్తాయి. ఈ అధ్యాయంలో 'చారిత్రాత్మక వీరుడు' ఔరంగజేబ్ చేసిన పనుల్లో కొన్ని మచ్చుతునకలు తెలుసుకుందాం. ఇవి చదివాక బొదింకల ఆలోచనా సరళి పూర్తిగా మారకపోయినా కనీసం వాటి మనసుల్లో చలనం కలుగుతుందని ఆశిద్దాం. కాస్త సిగ్గు తెచ్చుకుంటారని కోరుకుందాం.

## ఔరంగజేబ్ - స్త్రీలపై అతనికున్న గౌరవం

ఔరంగజేబ్ హరెంలో 1,000 మంది వేశ్యలుండేవారు (అక్బర్ దగ్గర 5,000, జహంగీర్ దగ్గర 6,000. అంటే ఔరంగజబ్ ఆరు రెట్లు తక్కువ వికృత స్వభావుడు!). వారిలో చాలా వరకు స్త్రీలు హిందువులే. బలవంతంగా ఎత్తుకుపోయి, కొని, వస్తువులుగా మార్పిడి చేసుకుని, లేదా బలవంతంగా వేశ్యావృత్తిలోకి నెట్టి - ఇలా ఏదో ఒక విధంగా వారిని చెరపట్టాడు.

ఐసిస్ ఉగ్రవాదులు కూడ అదే పరంపరని కొనసాగిస్తున్నారు - పగలూ రాత్రీ ముస్లిమేతర మహిళల మానప్రాణాలను దోచి అల్లాకి సేవ చేయడం, ఉదయం నాలుగింటికల్లా నిద్ర లేచి అల్లాను ధ్యానించడం, మళ్లీ పగలంతా అల్లాకి సేవ చేయడం! అలాగే, నలుగురికి మించకుండా భార్యలనుంచుకొని దైవాజ్ఞని నెరవేర్చడం! అల్లా కోసం ఇవన్నీ చేస్తే స్వర్గానికెళ్లాక 72 మంది కన్యలు బహుమతిగా లభిస్తారు కద మరి!

## ఉంపుడుగత్తెల మార్పిడి

ఔరంగజేబ్ బాబాయి సయీఫ్ ఖాన్ బుర్హాన్పూర్ గవర్నరుగా ఉండేవాడు. అతని ఉంపుడుగత్తె జైనాబాది మహల్ (హీరా బాయి అనే హిందూ స్త్రీ) ని ఔరంగజేబ్ వలచాడు. మామకి, దైవభీతి ఉన్న అల్లుడికీ మధ్య మార్పిడి ఒప్పందం కుదిర్చింది అత్త. హీరా బాయి ని తను తీసుకుని తన ఉంపుడుగత్తె ఛాత్తర్ బాయి (మరో హిందువు) ని తన మామకి ఇచ్చాడు ఔరంగజేబ్.

ఇద్దరు వీరులూ ఇస్లాం పవిత్రతని కాపాడడమే కాకుండా తమ మధ్య ఉన్న సున్నితమైన బంధాన్ని నిలుపుకోగలిగారు. వీళ్లు, ఐసిస్, ఐఆర్ఎఫ్, తాలిబాన్, ఇతర ఇస్లామిక్ వాదుల ప్రకారం తన స్థాయికి తగినట్టు తనకి నచ్చినంతమంది ఉంపుడుగత్తెలనుంచుకోవడం ఏ ముస్లింకైనా

ఇస్లాంలో సమ్మతమే. ముస్లిమేతరులను బలవంతంగా ఎత్తుకుపోయి పెద్ద పెద్ద హరెంలు ఏర్పరుచుకోవడం, వినూత్న రీతిలో మార్పిడి ఒప్పందాలు చేసుకోవడాలు, వేలం వేయడాలు, అమ్మడం, కొనడం, ఉచితంగా ఇవ్వడం, విటుల పైశాచిక కోర్కెలు తీర్చడం అన్నీ కూడ ఇస్లాంలో సమ్మతమే.

అబ్దుల్ కలాం వంటి శాస్త్రవేత్తలు మహిళలను విచ్చలవిడిగా వాడుకోవడమనే ఆలోచననే దరిచేరనీయకుండా దేశ సేవలో నిమగ్నమై ఉండిపోతే అటువంటి వారు అసలు ముస్లిమే కాదని ఈ ప్రవక్తలు చెప్తారు. ఆయన చనిపోయినప్పుడు పేరున్న ఏ ముస్లిం మత పెద్దా ఆయనకి సంతాపం తెలపలేదంటే ఇంకా ఆశ్చర్యం ఏముంటుంది.

## కుటుంబాన్ని చంపినవాడు

తరతరాలుగా ఇస్లామిక్ నరహంతకుల కుటుంబాల్లో వస్తున్న ఆచారం స్వంత వారిని పొట్టనబెట్టుకోవడం. మహమ్మద్ ప్రవక్త కుటుంబానికి కూడ దీన్నుండి మినహాయింపు లభించలేదు. ఆ ఆచారాన్ని కొనసాగిస్తూ ఔరంగజేబ్ కూడ తన తండ్రి, ముగ్గురు సోదరులని కూడ చంపి సింహాసనాన్ని కైవసం చేసుకున్నాడు.

అతను చేసిన పాపం, తన తాత ముత్తాతల కాలం నుండి వస్తున్న హత్యల పరంపర అతనికి తెలుసు. అందుకే అతని స్వంత కొడుకు (సక్రమ సంతానమే) ని బంధించి వీలునామాలో "కొడుకులను ఎప్పటికీ నమ్మరాదు" అని వ్రాయించుకున్నాడు. అతని అక్రమ సంబంధాల ద్వారా కలిగిన సంతానానికి లెక్కలే లేవు. ఊహాగానాలు తప్ప.

## గుళ్లనూ, గురుద్వారాలనూ నాశనం చేశాడు

ఔరంగజేబ్ లెక్కలేనన్ని గుళ్లను, గురుద్వారాలను, బడులనూ నాశనం చేశాడు. అతని దృష్టిలో హిందువులంత నీచమైన ప్రాణులు మరేవీ లేవు. అతని హిందూ ద్వేషానికి ఆహుతైన లెక్కకు మించిన గుళ్లలో కాశీ విశ్వనాథ మందిరం, కేశవ దేవ మందిరం (శ్రీ కృష్ణుని జన్మస్థానం), సోమనాథ్ దేవాలయం మూడు అత్యంత ప్రాముఖ్యతలున్నవి. బాబర్ అప్పటికే తన స్వలింగ సంపర్క ప్రేమికుడి జ్ఞాపకార్థం రామ జన్మ భూమి అయోధ్యలోని రామ మందిరాన్ని నాశనం చేశాడు.

## గురు తేజ్ బహద్దూర్ ని తల నరికి చంపాడు

సిక్కుల మత గురువు తేజ్ బహద్దూర్ అనుచరులందరినీ అతని కళ్లెదుటే చంపిన తరువాత కూడ అతను ఇస్లాం లోకి మారనందుకు శిక్షగా అతన్ని కౄరంగా తల నరికి చంపాడు ఔరంగజేబ్. అంతే కాక అతని జీవితాంతం గురు గోబింద్ సింగ్ తో పోరాడుతూనే ఉన్నాడు. సిక్కులనే కాదు. సుఫీలను కూడ ఊచకోత కోశాడు ఔరంగజేబ్. ఐసిస్, అల్ ఖాయిదా లాగే అతను కూడ సూఫీలు ఇస్లాం వ్యతిరేకులని నమ్మేవాడు.

## కాశ్మీర్ లో బలవంతపు మత మార్పిడులు

ఔరంగజేబ్ కాశ్మీర్ లో మత వ్యాప్తిపైన ప్రత్యేక శ్రద్ధ పెట్టాడు. ఎందుకంటే అనాదిగా హిందువులకది ప్రాముఖ్యమున్న ప్రాంతం. హిందువులకి రెండు మార్గాలు ఇచ్చి ఎంచుకొమ్మన్నాడు - ఒకటి, మానభంగాలు, హత్యలకు గురై హిందువుగా ఉంటూ చితికిపోవడం, రెండు, ముస్లిం మతం పుచ్చుకుని బ్రతికిపోవడం. కాశ్మీరీ పండితుల తరిమివేత అప్పుడే మొదలయింది. గురు తేజ్ బహద్దూర్ హిందువుల పక్షాన నిలిచాడు. అందుకే అతనికి కూడ అవే రెండు మార్గాలు ఇచ్చారు. అతను చావడానికైనా సిద్ధం కాని లొంగే ప్రసక్తి లేదన్నాడు. అతను చనిపోయాడు కాని అతని ఆశయం నిలిచిపోయింది. నిరంకుశ మొఘుల్ పాలన త్వరలోనే అంతమయింది. ఈనాడు బాబర్, ఔరంగజేబ్ సంతతి వాళ్లు లఖ్నో, హౌరా స్టేషన్లలో అడుక్కుతింటున్నారు.

## హిందువులపై జజియా పన్ను

ఇస్లాం మతం స్వీకరించనందుకు మూల్యంగా హిందువులపై జజియా పన్ను విధించాడు ఔరంగజేబ్. కొంతమంది హిందువులు దాన్ని శాంతియుతంగా వ్యతిరేకిస్తుంటే వారిని ఏనుగులతో తొక్కించి చంపేశాడు.

## దీపావళి పై నిషేధం

అతను టపాసులని నిషేధించి, దీపావళి సంబరాలపైన ఆంక్షలు విధించాడు.

## హిందూ మత విధ్వంసానికి కుట్ర

హిందువులు గుర్రాలపై తిరగడంకాని, ఏనుగు అంబారీ ఎక్కడం కాని, పల్లకీల్లో వెళ్లడం కాని ఏవీ చేయకూడదని ఆంక్షలు పెట్టాడు ఔరంగజేబ్. హిందువుల స్థాయి ముస్లింలకంటే తక్కువని అందుకే అటువంటివేవీ హిందువులు చేయరాదని నిషేధించాడు. హిందువులెవరైనా ఇస్లాంలోకి మారితే వారికి పారితోషికాలిస్తానని ప్రకటించాడు.

## ఔరంగజేబ్ దుష్ట వ్రాతలు, చేతల్లో ప్రముఖమైన ఓ పది

- "దేవాలయాన్ని చూడడం కూడ ఇస్లాం ప్రకారం పాపమే" - 13 అక్టోబరు, 1666
- "దారా సిఖోహ్ ఇస్లాంకే ఒక కళంకం" (అతని అన్న దారా సిఖోహ్ కృష్ణ మందిరానికి కానుకలిచ్చాడు) - 13 అక్టోబరు, 1666
- "కల్క ఆలయాన్ని ధ్వంసం చేయండి" - 3 ఇంకా 12 సెప్టెంబరు, 1667
- "రాజ్యంలోని అన్ని దేవాలయాలు, బడులు ధ్వంసం చేయండి. బహిరంగ ప్రదేశాల్లో పూజలను నిషేధించండి" - 9 ఏప్రిల్, 1669
- కృష్ణమందిరం కూల్చి దానిపైన మసీదు కట్టబడింది - జనవరి - ఫిబ్రవరి 1670
- కాశీ విశ్వనాథాలయం ధ్వంసం చేసి దానిపైన మసీదు కట్టబడింది - జనవరి - ఫిబ్రవరి 1670
- రాజస్థాన్ లో వందలకొద్దీ గుళ్ళు ధ్వంసం - 23 డిసెంబరు 1679
- రాజస్థాన్ లోని ఛిత్తోఢ్ లో గుళ్లు పడగొట్టడం
- ధ్వంసం చేసిన గుళ్ల నుండి విగ్రహాలు తెచ్చి జామా మస్జిద్ మెట్లుగా వేసి తరతరాలుగా వాటిని తొక్కించడం
- దేశంలో అనేకానేక దేవాలయాల ధ్వంసం (ధ్వంసం చేయమని జారీ చేసిన ఆజ్ఞలు లెక్కలేనన్ని)

# 8

# రక్తమోడ్చిన టిప్పు సుల్తాన్ ఖడ్గం

బూటకపు లౌకికవాదం పుట్టించిన మరొక పుకారు గురించి మనం ఈ అధ్యాయంలో తెలుసుకుందాం - అది టిప్పు సుల్తాన్ ఖడ్గం గురించి. చరిత్ర పాఠ్య పుస్తకాలు, సంజయ్ ఖాన్ తీసిన "స్వార్డ్ ఆఫ్ టిప్పు సుల్తాన్" సీరియల్, మైసూరు కోట టిప్పు సృష్టించిన ఓ అద్భుతం అనే అబద్ధపు ప్రచారం, వగైరాల పుణ్యమా అని ఓ క్రూర నియంత, మత ఛాందసుడు, ఉగ్రవాది, వికృత స్వభావి అయిన ఒక నీచుడు భారత దేశ చరిత్రలో ఒక మహాపురుషుడిగా చిత్రింపబడ్డాడు. ఇతని క్రూరత్వం ముందు ఒసామా బిన్ లాడెన్ వంటి ఉగ్రవాదులు కూడ దిగదుడుపే.

నిజమైన చరిత్రని తిరగేసి ఈ ఉగ్రవాది నిజస్వరూపమేంటో మనం తెలుసుకుందాం. 'లౌకికవాద' చరిత్రకారుల దుష్ప్రభావంతో నీచులని వీరులుగా నమ్ముతున్న వాళ్లకి, దేశ పునర్నిర్మాణంలో పాలు పంచుకోలేక నిమిత్తమాత్రులై ఉన్న వాళ్లకి ఇది ఉపయోగపడుతుందని ఆశిద్దాం. ఈ క్రమంలో మనం నిజమైన లౌకికవాదాన్ని కూడ చాటుతామని ఆశిస్తున్నాను.

టిప్పు సుల్తాన్ హిందువులపై చేసిన దురాగతాలని తానే అక్షర రూపంలో వదిలి వెళ్లాడు. అవి అతని రెండు ఆత్మ కథలు (క్రింద ఇచ్చినవి) చదివితే తెలుస్తుంది:

- సుల్తాన్ ఉత్ తవారిఖ్
- తారిఖ్-ఇ-ఖుదాదది

ప్రముఖ చరిత్రకారుడు కె.ఎం. పానిక్కర్ ఓ సారి అనుకోకుండా ఇండియా ఆఫీస్ లైబ్రరీ లో టిప్పు వ్రాసిన ఉత్తరాలు చూడడం జరిగింది. అవి ఇప్పుడు విరివిగా ప్రచురణలోకి వచ్చాయి. టిప్పు నిజస్వరూపాన్ని బయటపెట్టాయి. ఉదాహరణకి టిప్పు మార్చి 22, 1788 లో అబ్దుల్ ఖాదర్ కి వ్రాసిన ఉత్తరంలో: "12,000 కు పైగా హిందువులకు ఇస్లాం భాగ్యం కలిగింది. స్థానిక హిందువులందరినీ నీ ముందుకి పిలిపించి ఇస్లాంలోకి మార్చు. ఒక్క నంబూద్రిని కూడ వదలకూడదు" అని వ్రాశాడు.

డిసెంబర్ 14, 1788 లో కాలికట్ లో ఉన్న అతని సైన్యాధ్యక్షుడికి వ్రాసిన ఉత్తరంలో: "హిందువులందరినీ బంధించి చంపేయి. ఇరవై ఏళ్ల లోపు వారందరినీ ఖైదు చేయి. మిగతా వారిలో ఒక 5,000 మందిని చెట్లకి ఉరి వేసి చంపేయి" అని ఉంది.

జనవరి 19, 1790 లో బద్రూస్ సమాన్ ఖాన్ కి వ్రాసిన ఉత్తరంలో: "నేను మలబార్ లో గొప్ప విజయం సాధించాను. నాలుగు లక్షల మంది హిందువులని ఇస్లాంలోకి మార్చాను. నేనిప్పుడు ఆ దరిద్రుడు రామన్ నాయర్ పైకి దండెత్తి వెళ్ళాలనే పట్టుదలతో ఉన్నాను" అని వ్రాశాడు.

టిప్పు మలబార్ లోని అనేక ప్రాంతాల్లో ఆజ్ఞలు జారీ చేశాడు. వాటి ప్రకారం "నిజం చెప్పైనా, అబద్దం చెప్పైనా, మోసగించైనా, బలవంతంగా-నైనా మీకు ఏవిధంగా వీలైతే ఆ విధంగా వారిని (హిందువులని) ఇస్లాం-లోకి మార్చేయండి" [హిస్టారికల్ స్కెచెస్ ఆఫ్ సౌత్ ఇండియా ఇన్ ఆన్ అటెంప్ట్ టు ట్రేస్ ద హిస్టరీ ఆఫ్ మైసూర్, మార్క్ విల్క్స్, వాల్యూమ్ II, పేజి 120]

ఆఫ్ఘనిస్తాన్ రాజు, అహ్మద్ షా అబ్దలీ మనుమడు అయిన జమాన్ షా తో టిప్పు మూడవ మైసూర్ యుద్ధానికి (1792) ముందు నుండి 1798 వరకు ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపాడు. ఈ ఉత్తరాలన్నీ హిస్టరీ ఆఫ్ టిప్పు

సుల్తాన్ అనే పుస్తకంలో కబీర్ కౌసర్ అనువదించారు. అతను ఒక చోట వ్రాస్తూ "పవిత్ర యుద్ధమే నా అంతిమ లక్ష్యం...ఈ భూభాగంలో చిన్నదై-పోయిన ఓ మహమ్మదీయుని రాజ్యాధికారాన్ని భగవంతుడు నోఆ ఆర్క్ లా పదిలంగా కాపాడతాడు, విస్తరించి ఉన్న నాస్తికుల రెక్కలు కత్తిరిస్తా-డు " అంటాడు.

ఫిబ్రవరి 5, 1797 లో వ్రాసిన ఒక ఉత్తరంలో "మనందరం ఏకమై మన మతానికి శత్రువులైన వారిపై పవిత్ర యుద్ధానికి కదలి రావాలి. తమరి సైన్యాలు మనకి అఖండ విజయాన్ని సమకూరుస్తాయి" అంటాడు.

ఫ్రా బార్తోలమేయో అనే పోర్చుగీసు యాత్రికుడు, చరిత్రకారుడు 1790 లో మలబార్ లో అతను చూసిన విషయాలను తన పుస్తకం 'వోయేజ్ టు ఈస్ట్ ఇండీస్' లో ఇలా వ్రాస్తాడు: "కాలికట్ లో చాలా వరకు ఆడ వారిని, మగవారిని ఉరి తీశారు. ఆ ఆటవికుడు టిప్పు సుల్తాన్ క్రిస్టి-యన్లను, హిందువులను నగ్నంగా చేసి ఏనుగుల కాళ్లకు కట్టేసాడు... వాళ్ల శరీరాలు...తుత్తునియలు అయ్యేవరకు. గుడులు, చర్చిలు తగ-లబెట్టమని, కూల్చేయమని, అపవిత్రం చేయమని, ధ్వంసం చేయమని ఆదేశాలిచ్చాడు. నేను సైతం ఎంతో మంది బాధితులకు వళప్పుర నదిని దాటడానికి సాయం చేశాను ".(పేజిలు 141-142)

టిప్పు సుల్తాను ఖడ్గంపైన పర్షియన్ భాషలో "నమ్మని వారిని నాశనం చేసే అశనిపాతం నా వీర ఖడ్గం. నీవే సర్వజ్ఞుడవు. మహమ్మద్ పై నమ్మ-కాన్ని పంచినవానికి నీవు విజయాన్ని ప్రసాదిస్తావు. మహమ్మద్ పై నమ్మకాన్ని తిరస్కరించిన వానికి నీ విశ్వరూపాన్ని చూపిస్తావు. నీతో కలిసివచ్చిన వానికి నీ అభయహస్తాన్నిస్తావు" అని చెక్కి ఉంటుంది (హిస్టరీ ఆఫ్ మైసూర్, సి హెచ్ రావు, వాల్యూమ్ III, పేజి 1073)

టిప్పు సుల్తాను దక్షిణాదిలో కూల్చిన 800 కు పైగా గుళ్ల వివరాలు చెబుతుంది మైసూర్ గజేటీర్. మనం ఎవరిని నమ్ముతాం - నద్వి (ఆల్ ఇండియా ముస్లిం ఓబిసి సంఘటన్ అధికార ప్రతినిధి మీర్జ అబ్దుల్ ఖయ్యుం నద్వి) చెప్పిన విషయాలనా, లేక టిప్పు సుల్తాను, అతని సమకాలీనులు స్వయంగా వ్రాసినవాటినా?

## పరిచయం

టిప్పు సుల్తాను తన రాజ్యాన్ని పదహారున్నర సంవత్సరాలు (డిసెంబర్

7, 1782 నుండి మే 4, 1799 వరకు) పాలించాడు. మలబార్ ప్రాంతం అతనికింద కేవలం ఎనిమిది సంవత్సరాలుంది. టిప్పు కుతంత్రుడైన పూర్ణయ్య సాయం తీసుకోకపోయినట్టయితే ఈనాడు కేరళ, కర్ణాటక రాష్ట్రాల్లో అంత మంది మహమ్మదన్లు ఉండేవారు కారు. అలాగే హిందువుల సంఖ్య తగ్గి వారి ఆస్తిపాస్తులు ఆవిరయ్యేవికావు.

మైసూరు దివాన్ అయిన పూర్ణయ్య (ఓ హిందువు) తన రాజు హైదర్ అలీ (టిప్పు తండ్రి) చావుని టిప్పు వచ్చేంత వరకు గోప్యంగా ఉంచి తిరుగుబాటు జరగకుండా చూసుకున్నాడు. టిప్పు సుల్తానుకు 90,000 సైన్యం, మూడు కోట్ల రూపాయలు, వెలకట్టలేనంత విలువైన ఆభరణాలు, మణి, మాణిక్యాలు దక్కేలా చేసాడు. రాజ్యాన్ని తానేలవచ్చనుకున్నాడు.

మహరాష్ట్ర, కూర్గ్, ట్రావెన్కోర్ ప్రాంతాల హిందూ రాజులెవరి నుండి తనకి ముప్పు లేదని భావించాడు టిప్పు. అలాగే ముస్లిం రాజు నిజాం కూడ తనకేమీ అడ్డంకి కాదనుకున్నాడు. అతను కేవలం బ్రిటీషు వాళ్లకి భయపడ్డాడు. వాళ్లని ఓడిస్తే తను సునాయాసంగా దక్షిణ భారతదేశం మొత్తానికీ చక్రవర్తి అవ్వచ్చని నమ్మాడు. అతను బ్రిటీషు వాళ్లపై అంతగా పగ పెంచుకున్నందుకే మన 'లౌకికవాద' చరిత్రకారులు అతనికి స్వాతంత్ర్య పోరాట వీరుని హోదా కట్టబెట్టాలనే వృధా ప్రయత్నం చేశారు.

విదేశీ శక్తులను అడ్డుకున్నంత మాత్రాన మాతృదేశంపైన ప్రేమ ఉన్నట్లు కాదు. బ్రిటీషు వాళ్లని ఎదుర్కొని దక్షిణ భారతానికి చక్రవర్తి అవ్వాలనే తన స్వార్థ ప్రయోజనం కోసం మరో విదేశీ శక్తి, ఫ్రాన్స్, సహాయం తీసుకున్నాడు. ఫ్రెంచి వాళ్లు కూడ మన దేశంపై పట్టు కోసం అప్పటికే పావులు కదుపుతున్నారు. టిప్పు బ్రిటీషు వారినెదుర్కోడానికి సెయింట్ హెలీనా దీవిలో బందీగా ఉన్న నెపోలియన్ సాయాన్ని, ఫ్రెంచి రాజు పదహారవ లూయి సాయాన్నీ కోరాడు. అటువంటి వాడు విదేశీ శక్తులకి శత్రువెలా అవుతాడు, మనకి వీరుడెందుకవుతడు?

పైగా అతను దేశంలో పూర్తి ఇస్లామిక్ పాలనని అమలు చేయాలనుకున్నాడు. అది జరగాలంటే ముందుగా బ్రిటీషు వాళ్లని అడ్డు తొలగించుకోవాలి. అది నెరవేరడానికి ముస్లిం రాజ్యాలైన పర్షియా, ఆఫ్ఘనిస్తాన్, టర్కీల సాయం అర్థించాడు. కొచ్చిన్ రాజుని కాని తనకి లొంగిపోయి తన సామంతుడైన మరే ఇతర రాజుని కానీ అతను హింసించలేదనేది వాస్తవమే. కానీ, దీని వల్ల అతను హిందువులకి మిత్రుడెలా అవుతాడు?

అతను, హైదరాబాద్ నిజాం మాత్రమే డక్కన్ ప్రాంతంలో అప్పుడు ఉన్న ముస్లిం పాలకులు. అందుకని నిజాంతో వైరం పెట్టుకోదలచుకోలేదు. నిజాం కూతురిని తన కొడుకుకిచ్చి పెళ్లి చేయాలని పట్టుబట్టాడు. కానీ అతను నడుమంతరంగా అధికారంలోకి వచ్చాడని, అతను రాజవంశీకుడు కాడనీ నిజాం అతని ప్రతిపాదనని తిరస్కరించాడు. (భగవాన్ గిద్వానీ ప్రకారం అప్పుడే యవ్వనంలోకి అడుగుపెట్టిన టిప్పుకి నిజాం తన కూతురినిచ్చి పెళ్లి చేయాలని హైదర్ అలీ ఖాన్ ఒకప్పుడు ప్రతిపాదించాడు). తనని చిన్న చూపూ చూసిన నిజాం మీద ఉన్న అక్కసుతో టిప్పు తన కొడుకుని కాననూర్ రాణి అరక్కల్ బీబి కూతురికిచ్చి వివాహం చేసాడు. ఆ రకంగా మలబార్ ముస్లింల విశ్వాసాన్ని సంపాదించి మలబార్ ప్రాంతం మీద తన పట్టు పెంచుకుందామని కూడ అతని పన్నాగం. దాని పర్యవసానాలేంటో మనందరికీ తెలిసిందే. అరక్కల్ బీబి కుటుంబం ఇస్లాంలోకి మారినప్పటికీ మాతృస్వామ్యాన్నే పాటించేవారు. ముస్లిం ఛాందసుడు అయిన టిప్పు దీన్నే 'సంస్కరించాలనుకున్నాడు'.

## అతను 'పాదిషాహ్' అవ్వాలనుకున్నాడు

టిప్పు బ్రిటీష్ వాళ్లని ఓడించి చక్రవర్తి అవ్వాలనుకున్నాడు. అతను జ్యోతిషులను సంప్రదించిన తరువాతే తన ఆశయ సాధనకు పూనుకోవాలనుకున్నాడు. శ్రీ రంగనాథ స్వామి ఆలయంలో కొంత మంది బ్రాహ్మణ జ్యోతిషులు ఉండేవారు. ఈ విషయమై వారిని సంప్రతించినప్పుడు కొన్ని పూజలు, పరిహారాలు పూర్తి చేసుకుంటే టిప్పు అతని ఆశయాన్ని సాధించగలడని జ్యోతిషం చెప్పారు. బ్రిటీష్ వారిని ఓడించి దక్షిణ భారతానికి చక్రవర్తి అవ్వాలనే తన జీవితాశయాన్ని సాధించగలుగుతాననే నమ్మకంతో వాళ్లు చెప్పిన పూజాధికాలన్నీ శ్రీ రంగనాథ స్వామి ఆలయంలో సక్రమంగా నిర్వర్తించడమే కాకుండా పూజారులందరికీ ఖరీదైన కానుకలు కూడ ఇచ్చాడు టిప్పు. ఈ చర్యలని మన చరిత్రకారులు హిందూ మతం పట్ల, మన ఆచారాల పట్ల అతనికున్న భక్తి, శ్రద్ధలని అన్వయించుకున్నారు. టిప్పు సుల్తాను, అతని మలబార్ ఇస్లామిక్ సైన్యం అసలు హిందూ దేవాలయాల విధ్వంసం సృష్టించారనే విషయాన్నే వాళ్లు నమ్మశక్యం కానిదిగా భావించారు.

లివిస్ రైస్ అనే ప్రముఖ చరిత్రకారుడు మైసూర్ చరిత్రపై ఉన్న అధికారిక పుస్తకాలననేకం కూలంకషంగా చదివాక ఇలా వ్రాశాడు: "టిప్పు చనిపోయేనాటికి సువిశాలమైన అతని సామ్రాజ్యంలో కేవలం రెండే రెండు

హిందూ దేవాలయాలు, అదీ శ్రీరంగపట్నం కోటలో ఉండేవి. కేవలం తన జాతకం చెప్పే బ్రాహ్మణుల తృప్తి కోసం ఆ రెంటినీ ధ్వంసం చేయకుండా వదిలేసాడు. ఆ ఆలయాల క్రింద ఉన్న దేవుడి మాన్యాలు, గుడికి సంబంధించిన ఆస్తిపాస్తులన్నీ అతను 1790 లోనే జప్తు చేసాడు. దేశం మొత్తం మీద హిందూ దేవాలయాల ధ్వంసం, వాటి మీద పెట్టిన ఆంక్షల కారణంగా ఆదాయం పూర్తిగా తగ్గిపోవడంతో దానికి పరిహారంగా ఈ రెండు దేవాలయాల ఆస్తులు జప్తు చేశాడు "

తన సొంత రాష్ట్రం మైసూర్లో టిప్పు సుల్తాన్ పాలన న్యాయంగా, జనరంజకంగా, ప్రగతిశీలంగా ఉండేదని చెప్పేవారు కొందరున్నారు. మనం ఈ సందర్భంగా మైసూరు వాసి ఎం.ఎ. గోపాల రావు గారు కొద్ది సంవత్సరాల క్రితం వ్రాసిన ఒక వ్యాసంలో ఏముందో చూద్దాం: "ప్రత్యేకంగా రూపొందించిన పన్నుల విధానం చూస్తే టిప్పు సుల్తాన్ మత పక్షపాత పైఖరి మనకి ప్రస్ఫుటంగా అర్థమవుతుంది. అతని మతస్తులకు (ముస్లింలకు) ఇంటి పన్ను, వస్తు పన్ను, ఇంకా గృహావసారలకు వాడే అనేక వస్తువులపై వేసే పన్ను నుండి మినహాయింపు వుండేది. ముహమ్మదనిజమ్ కి మారిన వాళ్లకి కూడ ఆ మినహాయింపు లభించేది. అలా మారిన వారి పిల్లల చదువులకు కూడ టిప్పు తగిన ఏర్పాట్లు చేయించేవాడు"

టిప్పు తండ్రి హైదర్ అలీ ఖాన్ తన పాలనలో హిందువులకి కూడ పరిపాలన, సైన్యం రెండిటికి సంబంధించిన ఉద్యోగాల్లోనూ ప్రాతినిధ్యం కల్పించేవాడు. కాని టిప్పు అధికారంలోకి రాగానే ఆ ఆనవాయితీని తప్పించేశాడు. అతనికి ముస్లిమేతరుల పట్ల అమితమైన ద్వేషముండేది. అతని పదహారేళ్ళ పాలనలో పూర్ణయ్య ఒక్కడే టిప్పు సంస్థానంలో పని చేసిన హిందూ దివాను కానీ, మంత్రి కానీ. 1797 నాటికి, అంటే అతని మరణానికి రెండేళ్ల ముందు, 65 అత్యున్నత ప్రభుత్వ స్థానాల్లో ఒక్కరు కూడ హిందువులు మిగల్లేదు. ముస్తదిర్లందరూ ముస్లింలే. 1792 లో బ్రిటీష్ వాళ్లకి పట్టుబడిన 26 మంది పౌర, సైనికాధికారుల్లో కేవలం ఆరుగురు మాత్రమే ముస్లిమేతరులు.

1789 లో హైదరాబాద్ నిజాం నవాబు, ఇతర ముస్లిం పాలకులు తమ ఆస్థానాల్లో, ప్రభుత్వ పదవుల్లో ముస్లింలను మాత్రమే నియమించాలంటూ చేసుకున్న తీర్మానంతో టిప్పు కూడ వంతపాడి దాన్ని మైసూరు రాష్ట్రంలో అమలు చేశాడు. చదువురాని వాడైనా, పని చేతకాని వాడైనా సరే ముస్లిం అయితే చాలు ముఖ్యమైన ప్రభుత్వోద్యోగాల్లోకి వచ్చేసేవా-

ళ్లు. పదోన్నతులు పొందాలన్నా ముస్లిం అయి ఉండాలి టిప్పు సుల్తాన్ రాజ్యంలో. ముస్లిం అధికారుల సౌకర్యార్థం, వాళ్ల సౌలభ్యంకోసం పన్ను పద్దులన్నీ అంతకు ముందులా మరాఠీ, కన్నడ భాషల్లో కాక పర్షియన్ భాషలోనే వ్రాయాలని ఆదేశాలిచ్చాడు టిప్పు. పైగా కన్నడ బదులుగా పర్షియన్ భాషని అధికారిక భాషగా ప్రకటించాలనుకున్నాడు. చివరికి ప్రభుత్వ పదవులన్నీ సోమరిపోతులు, బాధ్యతలేని వారు అయిన ముస్లింలతో నిండిపోయాయి. దీని మూలంగా ప్రజలు ఎంతో కష్టపడవలసి వచ్చేది. ముస్లిం అధికారులు మాత్రం బాధ్యత లేకుండా జల్సా చేసేవాళ్లు. అన్ని స్థాయిల్లో ఉన్న ముస్లిం అధికారులూ అత్యంత అవినీతిపరులూ, అవిశ్వసనీయులు. ప్రజలు ఆధారాలతో సహా టిప్పు సుల్తానుకి ఫిర్యాదు చేసినా కూడ అతను పట్టించుకునేవాడు కాడు. వాళ్ల ఫిర్యాదులపైన విచారణకి ఆదేశించేవాడు కాడు.

## ఊర్లపేర్లు కూడ మార్చేసాడు

టిప్పు స్వంత కొడుకు గులాం ముహమ్మద్, ముస్లిం చరిత్రకారుడు కిర్మాణి వ్రాసిన వాటి ఆధారంగా గోపాల రావు ఇలా వ్రాశారు: ప్రదేశాలకు హిందూ పేర్లున్నా టిప్పు సహించేవాడు కాడు.

- మంగళపురి (మంగళూరు) ని జలాలాబాద్ గా మార్చేశాడు.
- కాననూర్ (కన్వాపురం) ని కుసానాబాద్ గా,
- బేపూర్ (వాయిప్పుర) ని సుల్తాన్ పట్నం లేదా ఫరూఖీ అనీ,
- మైసూరు ని నజారాబాదు గా
- ధార్వాడ్ ని ఖుర్షేద్-సవాద్ గా
- గూటి ని ఫయీాజ్-హిస్సార్ గా
- రత్నగిరిని ముస్తఫాబాద్ గా
- దిండిగల్ ని ఖలీఖాబాద్ గా
- కాలీకట్ (కోజీకోడ్) ని ఇస్లామాబాద్ గా

మార్చేశాడు. టిప్పు మరణించిన తరువాత స్థానిక ప్రజలు ఆ పేర్లను

తిరిగి మార్చేసుకున్నారు.

## కూర్గ్, బెద్నూర్, మంగళూరుల్లో ఇస్లామిక్ దురాగతాలు

టిప్పు సుల్తాను కూర్గ్ లో సాగించిన దురాగతాలకి మరేదీ సాటి రాదు. ఒక సందర్భంలో ఏకంగా పది వేల మంది హిందువులని మహమ్మదనిజమ్ లోకి మార్చేశాడు. మరొక సందర్భంలో 1000 మంది కూర్గిలను మతం మార్చి శ్రీరంగపట్నం కోటలో బంధించాడు. బ్రిటీషువారితో టిప్పు చేసిన ఆఖరి యుద్ధ సమయంలో శ్రీరంగపట్నంలో అయోమయం, అరాచకత్వం ప్రబలిపోయింది. అప్పుడు కోటనుండి తప్పించుకున్న కూర్గి బందీలందరు తమ స్వస్థలాలకు పారిపోయి మళ్లీ హిందూ మతంలోకి మారిపోయారు. కూర్గ్ రాజావారి కూతురికి ఎటువంటి హానీ తలపెట్టనని అతనికి ఒట్టు పెట్టి మాట ఇచ్చి కూడ ఆ మాటని తప్పాడు టిప్పు. రాజావారి కూతురి అభిమతానికి విరుద్ధంగా ఆమెని ఎత్తుకుపోయి బలవంతంగా పెళ్లి చేసుకున్నాడు.

1785 లో టిప్పు సుల్తాన్ కూర్గి హిందువులకి స్నేహితుడిగా ఉంటానని మాటిచ్చాడు. వాళ్లు అతన్ని తమ ఇళ్లలోకి ఆహ్వానించారు. వచ్చిన అతిథులకి మర్యాదలు చేసే పనిలో ఉన్న కూర్గులపై ఒక్కసారిగా దాడి చేసింది టిప్పు సైన్యం. పారిపోలేని ప్రతి కూర్గి మహిళని మానభంగం చేశారు. మగ పిల్లలని కూడ వదల్లేదు. లక్ష మంది హిందువులని బంధించి వాళ్లని బలవంతంగా మతమార్పిడి చేశారు.

టిప్పు ఉత్తర కర్ణాటకలోని బిద్నూర్ పైకి దండెత్తినప్పుడు, దాన్ని జయించాక అక్కడ చేసిన దారుణాలు అత్యంత అనాగరికమైనవి, చెప్పనలవికానివి. చిరక్కల్ రాజ్యానికి చెందిన కమ్మరన్ నంబియార్ ని హైదర్ అలీ ఖాన్ బలవంతంగా ఇస్లాం లోకి మార్చేసి అతని పేరుని అయాజ్ ఖాన్ గా మార్చాడు. ఆ అయాజ్ ఖాన్ ని బిద్నూర్ గవర్నరుగా నియమించాడు టిప్పు. తన కొడుకు టిప్పు కంటే అయాజ్ తెలివైనవాడని, సమర్థుడని నమ్మేవాడు హైదర్ అలీ ఖాన్. అందుకే టిప్పుకి అయాజ్ అంటే అసూయగా ఉండేది. తనని చంపడానికి టిప్పు రహస్యంగా పన్నాగం పన్నుతున్నాడని తెలుసుకున్న అయాజ్ బోలెడంత బంగారం తీసుకుని బొంబాయికి పారిపోయాడు. టిప్పు బిద్నూరు ప్రజలందరినీ బలవంతంగా ఇస్లాం లోకి మార్చేశాడు.వాళ్లు తమ ప్రాణాలు నిలబెట్టుకోడం కోసం మతం మారక తప్పలేదు.

మంగళూరుని ఆక్రమించిన తరువాత వేల మంది క్రిష్టియన్లని అక్కడి-నుండి శ్రీరంగపట్నానికి పంపించి వాళ్లకి బలవంతంగా సున్తీ చేయించి, ఇస్లాంలోకి మార్చేశాడు. బ్రిటీషు వాళ్లు రాకముందు పోర్చుగీసు వారి ప్రాబల్యం ఉన్నప్పుడు వాళ్ల మిషనరీలు చాలా మంది ముస్లింలను క్రి-ష్టియన్లుగా మార్చేశాయని, దానికి పరిహారంగానే తాను వాళ్లని తిరిగి ఇస్లాంలోకి మారుస్తున్నానని చెప్పాడు టిప్పు. తన ఈ చర్య వారికి ఒక గుణపాఠం అవుతుందని గర్వంగా చెప్పేవాడు.

ఆ తరువాత ఉత్తర కర్ణాటక సరిహద్దుల్లో ఉన్న కుంబాల పైకి దండెత్తి వెళ్తూ ఆ దారిలో ఉన్న ప్రతి ఒక్క హిందువునూ ఇస్లాంలోకి మార్చేశాడు. ఈ సారి అతని సాకు ఏంటంటే అందరూ ఒకే మతం (మహమ్మదనిజం) లో ఉంటే ప్రజల్లో ఐకమత్యం పెరుగుతుందని, బ్రిటీషు వాళ్లని ఓడించడం సులువౌతుందని. దీనికి ఈనాటి మన 'లౌకికవాద' చరిత్రకారులు కూడ వంత పాడుతారు.

## మలబారులో

మలబారులో టిప్పు గురి అంతా ప్రధానంగా హిందువుల మీద, వాళ్ల గుళ్ల మీద ఉండేది. లివిస్ బి బౌరి ప్రకారం భారతదేశంలో హిందువులమీద మొహమ్మద్ ఘజిని, అల్లాఉద్దీన్ ఖిల్జి, నాదిర్ షా లు సాగించిన దమన-కాండ కంటే టిప్పు మలబార్ హిందువుల మీద చేసిన దారుణాలు ఇంకా భయంకరమైనవి, పైశాచికమైనవి. టిప్పు తన ప్రత్యర్థులను మాత్రమే మతం మార్చేవాడని ముఖర్జి చెప్పిన విషయాన్ని విభేదిస్తాడు బౌరి తన పుస్తకంలో. ఎంతటి కౄరుడైనా తన శత్రువులను మాత్రమే హింసిస్తాడు, చంపుతాడు. కానీ టిప్పు అమాయకులైన ఆడవాళ్లు, పిల్లల మీద చేసిన ఘోరాలు ఏ రకంగా చూసినా సమర్థనీయం కాదు.

## ఇస్లామిక్ సైతాను విలయతాండవం

మలబార్ జిల్లాకి కలెక్టరుగా కొంతకాలం పని చేసిన విలియమ్ లోగన్ వ్రాసిన మలబార్ మాన్యువల్ ప్రకారం చిరక్కల్ తాలూక లోని త్రిచంబ-రం, తాలిప్పరంపు ఆలయాలు, తేలిచ్చేరి లోని తిరువంగట్టు ఆలయం (ఇత్తడి గోపురం ఉన్నది), బదకర దగ్గర్లోని పొన్మెరి ఆలయం అన్నీ టిప్పు సుల్తానే ధ్వంసం చేయించాడు. మణియూర్ మసీదు ఒకప్పుడు హిందూ దేవాలయం అని ఈ పుస్తకంలో చెప్తారు. టిప్పు సుల్తాను కాలంలో దాన్ని

మసీదుగా మార్చారని స్థానికుల నమ్మకం.

వటక్కనూరు రాజు రాజా వర్మ వ్రాసిన సాహిత్యంలో ఒక గొప్ప పుస్తకం 'కేరళలో సంస్కృత సాహిత్యం, దాని చరిత్ర'. టిప్పు సైనిక పాలన (పద-యోట్టం) లో కేరళలో హిందూ దేవాలయాలు చవిచూసిన అపారమైన కష్ట నష్టాలను వివరిస్తూ: "టిప్పు సైనిక దాడుల్లో కేరళలోని హిందూ దేవాల-యాలకు అపరిమితమైన నష్టం వాటిల్లింది. ఆలయాలను తగలబెట్టడం, విగ్రహాలను ధ్వంసం చేయడం, ఆలయ గోమందల నుండి ఆవులను తీ-సుకువచ్చి విగ్రహాలమీద వాటి తలలు నరకడం వంటి పైశాచికానందాలు టిప్పుకి, అతని సైన్యానికి పరిపాటి. తలిప్పరంపు, త్రిచాంబరం ఆలయా-లలో వీళ్లు సృష్టించిన విధ్వంసం తలచుకుంటేనే హృదయం కలచివేస్తుం-ది. ఈ అనాగరిక రావణుడు సృష్టించిన విధ్యంసకాండ నుండి నేటికీ అవి కోలుకోలేదు"

## కోజీకోడ్ ని శ్మశానంగా మార్చారు

1784 లో బ్రిటీషు వారికీ, టిప్పుకి మధ్య కుదిరిన మంగుళూరు ఒడం-బడిక లో ఉన్న నియమాల ప్రకారం టిప్పుకి మలబారు పైన ఆధిపత్యం ఉంటుంది. "దాని పర్యవసానంగా మలబార్ హిందువులు చరిత్రలో ము-నుపెన్నడూ కనీ వినీ ఎరుగనంత దుర్మార్గాలకి, పాపాలకీ గురయ్యారు" అని అంటారు కే.వి. కృష్ణ అయ్యర్ కాలికట్ జమోరిన్ల పై ఉన్న అధికా-రిక రచనలనాధారంగా చేసుకుని తాను వ్రాసిన 'కాలికట్ జమోరిన్లు' అనే పుస్తకంలో.

"ప్రజలకు బలవంతంగా సున్తి చేయించడం, వారిని ఇస్లాంలోకి బలవం-తంగా మార్చడం వంటి అనాగరిక చర్యలకు టిప్పు పాల్పడుతుండడంతో జమోరిన్ లలో సింహాసనానికి వారసుడైన ఎరల్పాడ్ టిప్పుకి తన వ్య-తిరేకతని తెలియజేశాడు. వాటి కారణంగా టిప్పు ట్రావెన్కోర్ ప్రాంతంలో చేయదలచిన సైనిక చర్యలకు కూడ తన మద్దతుండదని చెప్పాడు. దీంతో ఆగ్రహించిన టిప్పు జమోరిన్లకి, వాళ్ల నాయకులందరికీ, వారి సై-న్యమంతటికీ కూడ సున్తి చేయించడమే కాకుండా వాళ్లనందరినీ ఇస్లాంలో కలిపేస్తానని శపథం పట్టాడు" అని వ్రాసాడు.

"ముహమ్మదన్ మతం మీది ప్రగఢమైన భక్తి, ధృడమైన విశ్వాసం ఉండడంతో తన మత ప్రచారానికి కోజికోడ్ సరైన ప్రాంతమని తోచింది

టిప్పుకి. మలబార్ హిందువులు మాతృస్వామ్య వ్యవస్థని వదులుకోవ-డానికి వ్యతిరేకులు. వారి 'అర్ధ నగ్నత్వం', 'బహు భర్తృత్వం' రూపు మాపి ఆ జనాల్నందరినీ ఇస్లాం మార్గంలోకి తీసుకురావాలనుకున్నాడు 'గొప్ప సంస్కర్త' అయిన టిప్పు" అంటారు ఎల్. బి. బౌరి.

మలబార్ హిందువులకి ముస్లిం హరెం లన్నా, ముస్లింల బహుభార్య-త్వం అన్నా, సున్తీ వంటి ముస్లిం ఆచారాలన్నా అంతకన్నా అసహ్యం. అనాదిగా వస్తున్న వారి కేరళ సంస్కృతికి అది పూర్తి విరుద్ధం.

కాననూరు లోని మాతృస్వామ్య కుటుంబం అరక్కల్ బీబి కుటుంబంతో వివాహ సంబంధం కోరుకున్నాడు టిప్పు. అది జరిగే నాటికి కోజికోడ్ బ్రా-హ్మణులకు నిలయంగా ఉండేది. 7,000 కు పైగా బ్రాహ్మణ కుటుంబాల-క్కడ ఉండేవి. టిప్పు అరక్కల్ బీబి కుటుంబంతో సంబంధం పెట్టుకున్నాక అతని ఇస్లామిక్ కృూరత్వానికి 2,000 కు పైగా బ్రాహ్మణ కుటుంబాలు బలైపోయాయి. అతను చివరికి స్త్రీలని, పిల్లలనీ కూడ వదల్లేదు. చాలా వరకు మగవాళ్లు అడవుల్లోకి పారిపోయారు.

డిసెంబర్ 25, 1955 లో వెలువడిన మాతృభూమి వారపత్రికలో ఎలాంకుళం కుంజన్ పిళ్లై ఇలా వ్రాశారు: "ముహమ్మదన్లు పెద్ద సంఖ్యలో పెరిగిపోయారు. వేలాది హిందువులని బలవంతంగా సున్తీ చేయించి ఇస్లాంలోకి కలిపేశారు. టిప్పు అరాచకాల ఫలితంగా నాయర్లు, చమర్ల (షెడ్యూల్డ్ కులాలు) బలగం పూర్తిగా క్షీణించింది. నంబూద్రిలు కూడ చా-లావరకు తగ్గిపోయారు."

గుంటెర్ట్ అనే జర్మన్ మిషనరీ వ్రాసినదాని ప్రకారం "1788 లో 60,000 పైచిలుకు సైన్యంతో కోజీకోడ్ పైన దండెత్తిన టిప్పు ఆ నగరాన్ని పూర్తిగా నేలమట్టం చేశాడు. మైసూరు నుండి వచ్చిన ఆ ఇస్లామిక్ కిరాతకుడు, అతని సైన్యం వర్ణించడానికి వీల్లేనంత కృూరత్వానికి, అరాచకానికి తెగ-బడ్డారు"

సి. ఎ. పార్క్ హర్స్ట కూడ అలాగే వ్రాస్తూ "దాదాపు కోజీకోడ్ మొత్తాన్ని దోచుకుని నేలమట్టం చేశారు" అంటారు.

## దేవాలయాల విధ్వంసం

కోజికోడ్ లోని తాలి, తిరువణ్ణూర్, వరక్కల్, పుత్తూర్, గోవిందపురం,

తళిక్కుణ్ణు మొదలైన ప్రముఖ దేవాలయాలు, దగ్గర్లోని ఇంకా అనేక గుళ్లు టిప్పు సైనిక చర్యల్లో పూర్తిగా ధ్వంసమయ్యాయి.

శ్రీరంగపట్నంలో టిప్పు సుల్తాను ఓడిపోయి 1792 ఒడంబడిక వ్రాసు-కున్నాక తిరిగి అధికారంలోకి వచ్చిన జమోరిన్ కొన్ని దేవాలయాలను పునర్నిర్మించాడు.

వేట్టుం ప్రాంతంలో కేరళదీశ్వరం, త్రిక్కాండియూర్, త్రిప్రంగటు వంటి పవిత్ర దేవాలయాలలో టిప్పు సుల్తాను భయంకరమైన వినాశనం సృష్టించాడు. జమోరిన్లు కొంతవరకు వీటిని పునరుద్ధరించారు.

తిరునవయ ఆలయం ఎంతో పురాతనమైనది. అది క్రీస్తు పూర్వం నుండి ఉన్న పుణ్యక్షేత్రం. అనాదిగా వస్తున్న వేద పాఠశాల అని దేశమంతటా ప్రాచుర్యం పొందినది ఈ గుడి. తమిళనాడు విష్ణు భక్తులకిది అత్యంత ప్రా-ముఖ్యమున్న క్షేత్రం. అటువంటి ఆలయం కూడ టిప్పు సుల్తాను సైన్యం దోపిడీకి గురయ్యింది (మలబార్ గజెట్).

పొన్నాని లోని తిరుక్కవు ఆలయం లోని విగ్రహాలను తొలగించి వాటిని పగులగొట్టి ఆ గుడిని తన ఆయుధాగారంగా మార్చాడు టిప్పు. ఈ ఆల-యానికి మరమ్మతులు చేసి పునరుద్ధరించిది జమోరినే.

జమోరిన్ల కులదైవాల ఆలయాలు కోటిక్కుణ్ణు, త్రితల, పణ్ణియూర్ వంటివి కూడ దోపిడీకి గురయ్యాయి, కూల్చివేయబడ్డాయి. ప్రసిద్ధ సుకపురం గుడిని కూడ కూల్చేశారు. పెరుంపరంపు దేవాలయం, ఎడప్పాడు లోని అళవాన్చేరి తంప్రక్కల్ (నంబూద్రి బ్రాహ్మణుల కులాధిపతి) యొక్క మరణేలిర ఆలయాలకు జరిగిన నష్టాన్ని మనం ఇప్పటికీ చూడవచ్చు.

ఎరనాడు లోని వెంగారి ఆలయం, తిరుక్కుళం ఆలయం, రామణత్తుకుర-లోని అళింజిల్లం ఆలయం, ఇంద్యన్నూర్ ఆలయం, మన్నూర్ ఆలయం, ఇంకా అనేకానేక గుళ్ళకు అపార నష్టం కలిగింది టిప్పు సైనిక హయాంలో.

టిప్పు మమ్మియూర్ దేవాలయాన్ని, పళయూర్ క్రిష్టియన్ చర్చిని ధ్వంసం చేసాక గురువాయూర్ ఆలయంపైన దాడి చేశాడు. టిప్పు సైన్యం గురువాయూర్ ఆలయానికి చేసిన నష్టం ఈనాడు కనబడడంలేదంటే అది హైద్రోస్ కుట్టి పుణ్యమే. అతను హైదర్ అలీ ఖాన్ చేత ముస్లిం గా మార్చ-బడిన ఒక హిందువు. అతను గురువాయూరు ఆలయాన్ని కాపాడడమే

కాకుండా ఆ గుడికి హైదర్ అలీ ప్రకటించిన ఆస్తి పన్ను మినహాయింపుని కొనసాగించి, తరువాత భక్తుల విరాళాలతో ఆ గుడికి మరమ్మతులు కూడ జరిపించాడు.

టిప్పు సుల్తాను ఆగ్రహానికి భయపడి గురువాయూరు ఆలయంలోని పవిత్ర విగ్రహాన్ని ట్రావెన్కోర్ లోని అంబళపుఱ శ్రీ కృష్ణ దేవాలయానికి తీసుకెళ్లిపోయారు. టిప్పు సుల్తాను సైనిక పాలన ముగిసిన తరువాత కానీ ఆ విగ్రహాన్ని తిరిగి గురువాయూర్ ఆలయానికి తీసుకురాలేదు. ఈనాటికీ అంబళపుఱ శ్రీకృష్ణ దేవాలయంలో గురువాయూర్ ఆలయ విగ్రహ ప్రతిష్టాపన జరిగిన ప్రదేశానికి నిత్య పూజలు జరుగుతున్నాయి.

పరంపదళి, పన్మయనాడు, వెంగిడాంగు చుట్టుపక్కల గుళ్లకి జరిగిన నష్టం నేటికీ మనం చూడవచ్చు. పరంపదళి ఆలయ గర్భగుడికి, దాని శిల్పసంపదకి టిప్పు సైన్యం చేసిన నష్టాన్ని చూస్తే మన గుండెలవిసిపోతాయి.

పీడకల లాంటి టిప్పు సైనిక పాలనలో కోజికోడ్ లో వాళ్లు సృష్టించిన వినాశనాన్ని ఆ సమయంలో కేరళలో విస్తృతంగా పర్యటించిన ఫ్రా బార్తోలోమేయో కళ్లకు కట్టినట్టు వివరిస్తాడు. ఫ్రెంచి కమాండర్ ఎం. లాల్లి సాయంతో టిప్పు సుల్తాను హిందూ, క్రిష్టియన్ జాతుల పట్ల ఎంత నీచంగా ప్రవర్తించింది, వారి పట్ల ఎంత కౄరత్వాన్ని ప్రదర్శించింది మనకు విశదంగా అర్థమవుతుంది.

## కేరళ రికార్డులు ఏమి చెప్తున్నాయి

గోవింద పిళ్లై తన ప్రసిద్ధ రచన 'హిస్టరీ ఆఫ్ లిటరేచర్' లో ఈ విధంగా చెప్తారు: "మళయాళం శకం 965, అంటే 1789-90 కాలంలో టిప్పు సుల్తాను తన ఆటవిక సైన్యంతో మలబార్ ప్రాంతంపైకి దండెత్తి వచ్చాడు. ఇస్లామిక్ మత ఛాందసవాదంతో అతను ధనానికి, మత ధర్మాలకి నిలయాలైన హిందూ దేవాలయాలనూ, క్రిష్టియన్ చర్చిలను ధ్వంసం చేసి వాటి ధనాన్ని పూర్తిగా కొల్లగొట్టాడు. అంతేకాక వందలకొద్ది ప్రజలని బలవంతంగా ఎత్తుకుపోయి, వాళ్లకి సున్తి చేయించి, వాళ్లని ఇస్లాంలోకి మార్చేశాడు. ఆ బాధితుల దృష్టిలో ఈ చర్యలు చావుకంటే హీనమైనవి"

కడత్తనాడులో 2,000 మంది నాయర్లతో కూడిన ఒక చిన్న పటాలం కట్టిపురంలోని ఒక కోటలో ఉండిపోయి టిప్పు సుల్తాను దురాక్రమణని

కొన్ని వారాలపాటు ఎదుర్కొంది. కానీ చివరికి వారందరూ ఆకలిచావు-లను ఎదుర్కోవలసిన పరిస్థితి ఏర్పడింది. అప్పుడు టిప్పు సుల్తాను కో-టలోనికి ప్రవేశించి వాళ్లు ఇస్లాంలోకి మారినట్టయితే ప్రాణబిక్ష పెడతానని చెప్పాడు. ఆ రెండు వేల మంది అభాగ్యులకు సున్తి చేయించి ఇస్లాంలోకి మార్చడమేకాకుండా వారిచేత గోమాంసం కూడ తినిపించారు.

టిప్పు సుల్తాను కబంధ హస్తాలనుండి తప్పించుకుపోయిన ఒకరిద్దరు మినహా పరప్పనాడ్ రాచకుటుంబం మొత్తాన్ని బలవంతంగా ముహ-మ్మదన్ మతంలోకి మార్చారు. అలాగే నిలంబూర్ రాచ కుటుంబానికి చెందిన తిరుప్పాడ్ ని బలవంతంగా ఎత్తుకుపోయి ఇస్లాంలోకి మార్చే-శారు.

వీరి ద్వారా ఆ తరువాత మిగతా వారి మత మార్పిడికి ప్రయత్నించా-రని చెబుతారు. చివరికి లొంగిపోయి సలాము చేసిన కొలాత్తిరి రాజా ని అకారణంగా కుయుక్తితో చంపించి అతని శరీరాన్ని ఏనుగు కాళ్ళకు కట్టి వీధుల వెంట లాక్కెళ్లాడు. అంతటితో ఆగక అతని శవాన్ని చెట్టుకి వేలా-డదీసి ఇస్లామిక్ ఛాందసులకి హిందూ రాజుల మీదున్న కసిని మరొక సారి నిరూపించుకున్నాడు.

వొడయార్ రాజకుటుంబాన్ని మొత్తం అవమానించి వారిని తమ రాజధాని శ్రీరంగపట్నంలో ఖైదు చేశారు హైదర్ అలీ ఖాన్, టిప్పులు. లొంగిపో-యిన పాల్ఘాట్ రాజు ఎట్టిపంగి అచ్చన్ ని కూడ అనుమానించి ఖైదు చేశారు. తరువాత అతన్ని శ్రీరంగపట్నం తీసుకెళ్లి అక్కడ బంధించారు. ఆ తరువాత అతనేమయ్యాడో ఎవరికీ తెలియదు.

పాల్ఘాట్ లోని క్రిష్టియన్లందరూ ప్రాణభయంతో పారిపోయారు. టిప్పు తన సైన్యాన్ని మలబార్ ప్రాంతంలో అనేక చోట్ల మొహరించి అక్కడి హిం-దువులని భయభ్రాంతులని చేశాడు. హైదర్ అలీ ఖాన్ వేసిన పన్నుల-ను టిప్పు మళ్లీ బలవంతంగా వసూలు చేశాడు. చేతికొచ్చిన పంటలను లాగేసుకున్నాడు. ఇటువంటి చర్యలు ఆఖరికి మాప్పిళ భూస్వాములు కూడ అతనిపై తిరుగుబాటు చేయడానికి ప్రేరేపించాయి.

హైదర్ అలీ ఖాన్ దేవాలయాలకు ఆస్తి పన్ను నుండి మినహాయింపు-నిచ్చాడు. కానీ టిప్పు మాత్రం ఆలయాలనుండి చాలా పెద్ద మొత్తాల్లో పన్నులు వసూలు చేసేవాడు. హైదర్ అలీ ఖాన్ కి లొంగిపోయిన పాల్ఘాట్

రాజుకు చెందిన కల్పతి లోని సుప్రసిద్ధ హేమాంబిక దేవాలయం, జమో-రిన్లని కాదని హైదర్ అలీ ఖాన్ తో చేతులు కలిపిన కొల్లనంకొట్టు రాజా కి సంబంధించిన కచ్చంకురిస్సి ఆలయం, అలాగే పాల్ఘాట్ లోని జైనమం-దిరం అన్నీ కూడ టిప్పు పన్ను విధానాల వల్ల తీవ్రంగా నష్టపోయాయి.

చాలా మంది నాయర్, బ్రాహ్మణ భూస్వాములు తమ అపారమైన ఆస్తి-పాస్తులనొదులుకొని దేశాన్నొదిలి పారిపోయారు. వారి భూములను మాప్పిళ లు కైవసం చేసుకున్నారు. టిప్పు కూడ వారిని అడ్డుకోలేదు. అటువంటి మాప్పిళ భూస్వాములు ఈనాడు తమ భూములన్నీ తాము నాయర్లు, బ్రాహ్మణుల దగ్గరనుండి అధిక మొత్తాలిచ్చి చట్టబద్ధంగా కొను-క్కున్నవేనని చెప్పుకుంటారు. హిందూ భూస్వాములకు పరిహారం ఏమీ ఇవ్వకుండ వారి భూములు లాక్కున్నారన్నది పచ్చి నిజం. అయినా వీళ్లు బొంకుతూనే ఉంటారు. ఇదే ఇస్లామిక్ ద్రోహం మళ్లీ 1921 మాప్పిళ అల్లర్లలో పునరావృతమయింది.

ఏదేమైనప్పటికి, టిప్పు మాత్రం సామూహిక హత్యలు చేయడంలో, లక్ష-లకొద్ది హిందువులని బలవంతంగా మతం మార్చడంలో, ప్రజల్ని వారి ఇళ్ల నుండి తరిమేయడంలో, చివరికి మిగిలిన వారిని కటిక దారిద్ర్యం-లోకి నెట్టేయడంలో విజయం సాధించాడు. చాలా మంది నిమ్న కులాల హిందువులు అతని బలప్రయోగాన్ని తట్టుకోలేక మతం మార్చుకు-న్నారు. కానీ ఇతరులు చాలామంది, ముఖ్యంగా తియ్యాలు, తెలిచ్చేర్రి, మాహే వంటి ప్రాంతాలకు పారిపోయి తలదాచుకున్నారు.

మలబార్ బ్రిటీష్ వాళ్ల చేతుల్లోకి వెళ్లిపోయాక హిందూ భూస్వాములు మాప్పిళ లు ఆక్రమించుకున్న తమ భూములను తిరిగి తీసుకోవాల-ని ప్రయత్నించారు. అప్పుడు ఈ ముల్లాలు హిందూ భూస్వాములను చంపడం ఓ పవిత్ర ఇస్లామిక్ కార్యమని తమ అనుచరులకి బోధించి వారిని ప్రేరేపించేవారు. దాంతో మలబార్ లో తరచుగా మాప్పిళ అల్లర్లు జరుగుతుండేవి.

చెరునాడ్, వెట్టతునాడ్, ఎరనాడ్, వళ్లువనాడ్, తమరస్సేరి, ఇంకా లోపలి ప్రాంతాల్లో మాప్పిళలు హిందువులపై దాడులు చేసి భీభత్సాన్ని సృష్టిం-చారు. ఇదంతా వారు అక్రమంగా దక్కించుకున్న భూములను కాపాడు-కోడానికి, టిప్పు హయాంలో ఉన్నట్టు ఇప్పుడు కూడ హిందువులపైన పట్టు కొనసాగించడానికి మాత్రమే. మాప్పిళుల సంఖ్య అధికంగా ఉండే

మలబార్ లోతట్టు ప్రాంతాల్లో మూకుమ్మడి దాడులకు భయపడి ప్రజలు బయట తిరగడానికి కూడ వెనుకాడే పరిస్థితి వచ్చింది.

లెఫ్టినంట్ కల్నల్ ఇ. ఫితియన్, ఆంధ్రియాన్సి, మాయన్, కె. పి. పద్మనాభ మీనన్, సదస్యతిలకన్, టి. కే. వేలు పిళ్లై, ఉళ్లూర్ పరమేశ్వర అయ్యర్, ఇంకా ఎంతో మంది ప్రముఖులు టిప్పు తన హయాంలో మలబార్ ప్రాంత హిందువులమీద చేసిన దురాగతాలను కళ్లకు కట్టినట్టు వివరించారు. అతను హిందూ దేవాలయాలనుండి కొల్లగొట్టి శ్రీరంగపట్నానికి తీసుకెళ్లిన సంపద అంతులేనంత. కొంతమంది మత ఛాందసవాద ముస్లింలు హిందువులపై జరిగిన దాడులు కేవలం బ్రిటీషు వాళ్లు మాత్రమే చేశారని, దానికి ముస్లింలని బాధ్యులుగా చూపించారని తప్పుడు ప్రచారం చేస్తున్నారు. బ్రిటీషు వాళ్లది విభజిచి పాలించే దమన నీతి అని, హిందువుల పట్ల ముస్లింలు ఎంతో ఉదారంగా ఉండేవారని, హిందూ ముస్లింలను విడగొట్టడం కోసమే ముస్లింలు దుర్మార్గులనే ప్రచారాన్ని బ్రిటీషు వాళ్లు లేవనెత్తారని ఆ ఛాందస ముస్లింలు ప్రచారం చేసిన కట్టు కథలకి కొంత మంది హిందువులు కూడ వంతపాడి వారి కుయుక్తులకు సహకరించడం అత్యంత దురదృష్టకరం, సిగ్గుచేటు కూడ.

ఈ అబద్ధం చివరికి రహస్యంగా మన చరిత్ర పుస్తకాల్లోను, రికార్డుల్లోను కూడ స్థానం సంపాదించింది. హిందూ ముస్లిం ఐక్యతని గురించి ఊదరగొడుతూ, ముస్లిం లీగ్, టిప్పు సుల్తాను, ఔరంగజేబ్ వంటి వారి లౌకికవాదాన్ని ఆకాశానికెత్తే 'హిందువులు' మాట్లాడే మాటలు నిజానికి హిందూ ముస్లిం ఐక్యత కోసం ఎంతమాత్రమూ కాదు. అది వారికి స్వతహాగా ఉన్న పిరికితనాన్ని కప్పిపుచ్చుకోడానికి మాత్రమే. వాళ్లెంతకి దిగజారుతారంటే 1921 లో జరిగిన మాప్పిళ అల్లర్లు కూడ స్వాతంత్ర్య పోరాటంలో భాగమే అని చెప్పడానికి కూడ వెనుకాడరు.

## ముగింపు

"ట్రావెన్కోర్ రాష్ట్రంపైన టిప్పు సుల్తాను చేసిన దాడికి సంబంధించి కొన్ని విషయాలను మనం ఇక్కడ విశ్లేషించుకోవడం సమంజసంగా ఉంటుంది. బలవంతుడు జమోరిన్ నుండి వాటిల్లే ముప్పునెదుర్కోడానికి నెడుంకొట్ట కోటని కట్టించి ఉండకపోతే మలబార్ కి పట్టిన గతే ట్రావెన్కోర్ కి పట్టి ఉండేది. దుర్భేద్యమైన ఆ కట్టడం వల్లే టిప్పు సుల్తాను తన పగని ట్రావెన్కోర్ కి ఉత్తర సరిహద్దుల్లో ఉన్న అంగమల్లి, అల్వాయె, వరప్పుఴ,

అలంగోడ్ వంటి పట్టణాలమీద దాడులతో సరిపుచ్చుకోవలసి వచ్చింది"

ఇది, ట్రావెన్కోర్ దివాను మాధవరావు తను వ్రాసిన ట్రావెన్కోర్ చరిత్రలో చెప్పిన విషయం. యూరోపియన్ చరిత్రకారుల రచనలు అతనికి అందుబాటులో లేవు. అప్పటికి లభ్యమైన స్థానిక రచనలు మాత్రమే అతని పుస్తకానికి ఆధారం అని మనం గమనించాలి.

అతను ఇంకా ఇలా వ్రాశాడు: "స్థానిక మాప్పిళలు అక్కడ ఏఏ కౄరమైన పనులు చేయాలనుకునేవారో అవే పనులను టిప్పు సుల్తాను, మతం మార్చుకున్న అతని దండు చేసే వారు. పురాతన ఆలయాలెన్నిటినో వాళ్లు నిర్దాక్షిణ్యంగా తగులబెట్టారు, ధ్వంసం చేశారు. వాళ్లు కూల్చిన ఆ గుడుల శిధిలాలే ముస్లింలు ఈ దేశంలో చేసిన అరాచకాలకి తార్కాణాలు. క్రిష్టియన్ చర్చిలు కూడ వారి విధ్వంసానికి గురికావలసి వచ్చింది. హైదర్ అలీ ఖాన్ కి మొదట్లోనే లొంగిపోయిన కొచ్చిన్ రాజు భూభాగాలు మాత్రమే టిప్పు సుల్తాను ధ్వంసం చేయకుండా వదిలాడు. అయినా, టిప్పు సుల్తాను, అతని సైన్యం పరూర్ లోకి ప్రవేశించి కొడుంగళ్లూర్ పైన ఫిరంగి దాడి చేస్తున్న సమయంలో ఆయన తనని, తన కుటుంబాన్ని టిప్పు బారినుండి కాపాడమని ట్రావెన్కోర్ రాజు కి వర్తమానం పంపాడు". (ఈ ఉత్తరం నకలు ప్రతిని కూడ పుస్తకంలో ప్రచురించారు)

ఇవి టిప్పు సుల్తాను, అతని ఆటవిక సైన్యం కలిసి సైనిక పరిపాలనలో సాగించిన ఆకృత్యాలు. అతని సైనిక పాలనని అధికారికంగా పదయోట్టకాలం అంటారు.

కటత్తనాడ్ రాజకుటుంబ సభ్యుడొకరు పదయొట్టకాలం పర్యవసానాన్ని - విధంగా వివరించాడు: "ఓ శివా, ఆలయం నుండి శివలింగం పోయింది (ధ్వంసం చేశారు), దేశం నుండి లింగం (మగతనం) పోయింది"

# ముగింపు

రచయిత ఎటువంటి ముగింపు ఇవ్వలేదు. పాఠకులు మీరే ముగింపు పలకాలి. భిన్నత్వంలో ఏకత్వం మంచిదే. కానీ, భిన్నత్వం అనేది మానభంగాలు చేసేవారిని, హంతకులని, విగ్రహాలను ధ్వంసం చేసేవాళ్లని, బలవంతంగా ఎత్తుకుపోయేవారిని, ద్వేషులని ఆరాధించడమే అయితే, అటువంటి వారిని మనతో ఎలా ఏకం చేస్తాం అనేదే నా ప్రశ్న. బూటకపు చరిత్రని అనుమతించి మన పూర్వీకుల హంతకులనే మన భావి తరాల వాళ్లు ఆరాధించేలా చేసి చూస్తూ ఊరుకుందామా? ఖాసింలని, ఘాజీలని, ఘోరీలని, ఛిశ్తిలనీ, ఖిల్జిలనీ, తైమూర్లనీ, బాబర్లనీ, అక్బర్లనీ, జహంగీర్లనీ, షా జహాన్లనీ, ఔరంగజేబులనీ, అబ్దలీలనీ, టిప్పులనీ ఆరాధించేవారి ఉనికి మిమ్మల్ని కలచివేయట్లేదా?

ఇటువంటి నీచులు 1947 లో మన భూభాగంలో నాల్గవ వంతు లాక్కుపోయారు. ఇప్పుడు మిగిలిన మన దేశంలో హిందువులు 80% మాత్రమే ఉన్నారు. 1947 తరువాత పరిస్థితి ఏమైనా మారిందా? ఈ దుర్మార్గులను ఆరాధించేవారు దాన్ని మానుకున్నారా? బాబ్రీ మసీదు కావాలనే వాదన బలపడిందేకానీ సన్నగిల్లిందా? హిందువులు వారు కోల్పోయిన ఆలయాలు తిరిగి పొందారా? రామ జన్మ భూమిలో రామాలయం తిరిగి నిర్మించుకోగలిగారా? వారణాసిలో కాశీ విశ్వనాథాలయం తిరిగి స్థాపించుకోగలిగారా? శ్రీ కృష్ణ జన్మస్థానం మథుర తిరిగివచ్చిందా? ముస్లింలు సంస్కరణలకొప్పుకుంటున్నారా? భారతీయులందరికీ ఒకే న్యాయ వ్యవస్థ (యూనిఫాం సివిల్ కోడ్) ఉండాలని ముస్లింలు ఒప్పుకుంటున్నారా? ముస్లింలు తమ పిల్లలకి తైమూర్, బాబర్, అక్బర్, తారిఖ్ ల పేర్లు పెట్టుకోవడం మానుకున్నారా?

ఈ ప్రశ్నల్లో దేనికైనా మీ సమాధానం 'కాదు' అయితే 'భిన్నత్వంలో' ఏకత్వం సాధించాల్సిన బాధ్యత కేవలం హిందువులదెందుకవుతుంది? ముస్లింలు కూడ ముందుకి వచ్చి అక్బర్ లని ఆరాధించడం ఆపి ప్రతాప్ లని తమ అక్కున చేర్చుకోవాలి. భారత్ లో ఏకత్వం సాధించడానికి అది తప్ప మరో మార్గమేదీ లేదు. మీ పిల్లలకి నిజమైన చరిత్రని నేర్పిస్తే వాళ్ల భవిష్యత్తు ఉజ్వలంగా ఉంటుంది. మీ పిల్లలకి బూటకపు చరిత్ర నేర్పిస్తే వాళ్లు కూడ చరిత్రలోనే కలిసిపోతారు.

# సంప్రదించిన గ్రంథాలు

[1] "చాచానామ: ఇస్లామిక్ కాఃక్వెస్ట్ ఆఫ్ సింధ్"

[2] విన్సెట్ స్మిత్: "అక్బర్ - ది గ్రేట్ మొఘల్"

[3] అబుల్ ఫజల్: "అక్బర్ నామ: ద హిస్టరీ ఆఫ్ అక్బర్"

[4] అబల్ ఫజల్: "అయిన్ ఎ అక్బరి"

[5] "బాబర్ నామ: మెమోయిర్స్ ఆఫ్ బాబర్"

[6] పి ఎన్ ఓక్: "హూ సేస్ అక్బర్ ఈస్ గ్రేట్"

[7] పి సి ఎన్ రాజ (1964): "ఇంగ్లీష్ ట్రాన్సలేషన్ ఆఫ్ ద మలయాళం ఆర్టికల్ ఆన్ టిప్పు సుల్తాన్" కేసరి సంవత్సరాది సంచిక

[8] ఫ్రాంకోయి బెర్నియర్ రచనలు

[9] ద విలి ప్రిన్సెస్

[10] కాత్రో రచనలు

# రచయిత పరిచయం

డాక్టర్ వశి శర్మ మతాలు, ఉగ్రవాదం, చరిత్ర, ఇస్లామిక్ దురాక్రమణలు వంటి అంశాల మీద పండితులు. ఉన్మాదాన్ని నివారించడంలో ఆయన సిద్ధహస్తులు. ఆయన వాగ్గాటి ఉన్న ఓ మంచి రచయిత, కవి, నవలాకారుడు. ఇస్లామిక్ మతోన్మాదం, చరిత్ర, ప్రేరణ మొదలైన అంశాలపైన ఆయన ఇంగ్లీషు, హింది భాషల్లో అనేక రచనలు చేశారు. ఐఐటి ముంబాయి లో చదివారు. వైజ్ఞానిక పరిశోధనా విభాగంలో భారత ప్రభుత్వం నుండి ప్రతిష్ఠాత్మక 'ఇన్స్పైర్' అవార్డునందుకున్నారు. ఆయన పరిశోధనలు అనేకం అంతర్జాతీయ వైజ్ఞానిక పత్రికల్లో ప్రచురితమయ్యాయి. ప్రస్తుతం ఆయన అగ్నివీర్ కి అధ్యక్షులుగా పని చేస్తున్నారు.

# అగ్నివీర్ గురించి

అగ్నివీర్ వ్యవస్థాపకులు శ్రీ సంజీవ్ నేవర్ ఒక ఐఐటి, ఐఐఎం పట్టభద్రుడు. ఆయన ఒక డేటా సైంటిస్టు, ఒక యోగి. వ్యక్తుల బాహ్య, అంతః ప్రపంచాల్ని సన్మార్గంలో పెట్టడానికి ఆధ్యాత్మికతతో కూడిన, నిఖార్సైన పరిష్కారాలను అందించడానికి ఆయన అగ్నివీర్ ను స్థాపించారు. వేదాలు, భగవద్గీత, యోగ వంటివి అందించే చిరకాల జ్ఞానంతో నేటి జీవిత సమస్యలకు పరిష్కార మార్గాలు చూపించడమే అగ్నివీర్ ప్రత్యేకత. ఆత్మహత్యల అంచున నిలిచిన వారికి, మనోవేదనను అనుభవిస్తున్న వాళ్లకి, జీవితం అగమ్యగోచరమైనవాళ్లకి, సామాజిక అసమానతలను ఎదుర్కోలేనివాళ్లకి ఇలా ఎందరికో పరిష్కారాలను చూపించింది. అగ్నివీర్ ప్రజల జీవితాలను ఎంతగా ప్రభావితం చేస్తుందో వారి విజయగాథలే మీకు చెబుతాయి.

ఇబ్బందికరమైన, విస్మరించిన, విషమమైన అనేక సమస్యలను ప్రజల దృష్టికి తీసుకువచ్చిన ఘనత అగ్నివీర్ కి దక్కుతుంది. భారతదేశంలో సామాజిక న్యాయం కోసం పోరాడుతున్న శక్తుల్లో అగ్నివీర్ ముందుంటుంది. కులాల అడ్డుగోడలు కూల్చడానికి, ఆడ మగ తారతమ్యాలను ఎదుర్కోవడానికి 'దళిత యజ్ఞం' పేరుతో ముందడుగు వేసింది. ముస్లిం మహిళల హక్కులకోసం పోరాడిన వారిలో ముందుంటుంది అగ్నివీర్. ఈ క్రమంలో ఛాందసవాదులు, సాంప్రదాయవాదులనుండి తీవ్రమైన ఒత్తిడినెదుర్కొంది. అయినా పట్టు వదలక హలాలా, వేశ్యా బానిసత్వం, బహుభార్యత్వం, ట్రిపుల్ తలాక్, ఇంకా లవ్ జీహాద్ వంటి అతి జుగుప్సాకరమైన ఆచారాలు, సమస్యలను వెలుగులోకి తెచ్చి వాటికి వ్యతిరేకంగా ప్రజలను ఏకం చేయడంలో విజయవంతమైంది. అగ్నివీర్ మహిళా హెల్ప్ లైను అలాంటి సమస్యలనెదుర్కొనే స్త్రీలకు బాసటగా నిలిచి అనేక మంది ముఖాల్లోకి నవ్వుల్ని తీసుకువచ్చింది.

దేశంలోని అనేక సమస్యాత్మక ప్రాంతాల్లో నేరస్తుల నుండి అమాయకులను కాపాడడానికి 'నిరాయుధ పోరాట శిక్షణా శిబిరాలు' అనే వినూత్న ప్రయత్నంతో ముందుకు వచ్చింది అగ్నివీర్. ఉన్మాదం, ఉగ్రవాదం వైపు మళ్లిన అనేక మందిని సన్మార్గంలో పెట్టిన ఘనత అగ్నివీర్ కి దక్కుతుంది. దుష్ట శక్తులు తమ రాజకీయ ప్రయోజనాలకోసం దేన్నైతే చరిత్ర అని మనకి నమ్మబలికి చెబుతూవచ్చిన కట్టు కథలని, వాటి వెనుక ఉన్న

ఉద్దేశాలనీ ప్రశ్నించే ధైర్యాన్నిచ్చింది అగ్నివీర్ చరిత్రని విశ్లేషించే విధానం.

యోగ, హిందూయిజం, స్వయం సహాయక విషయాలమీదే కాకుండా సామాజిక న్యాయం, కులాల సమానత్వం, లింగ వివక్ష, మానవ హక్కులు, మతపరమైన వివాదాస్పద హక్కులు, చరిత్ర వంటి అంశాల మీద కూడ అగ్నివీర్ అనేక పుస్తకాలను ప్రచురించింది. పాఠకులు మా ముక్కుసూటితనాన్ని, ఆచరణాత్మక శైలిని, పరిష్కారాలను అందించే-దిగా ఉన్న, కొత్తదనంతో నిండిన, నూతనోత్సాహం నింపే, ఆలోచింపజేసే మా బాణీని ఎంతగానో ఇష్టపడ్డారు, స్వాగతించారు.

అర్థవంతమైన ఒక జీవితాన్ని నిండుగా జీవించాలనుకునే ప్రతి ఒక్కరికి అగ్నివీర్ లో స్థానముంటుంది.

అగ్నివీర్ గురించి ఇంకా వివరంగా తెలుసుకోవాలనుకుంటే ఈ క్రింది వాటిని దర్శించండి

వెబ్ సైట్: www.agniveer.com

ఫేస్ బుక్: www.facebook.com/agniveeragni

యూట్యూబ్: www.youtube.com/agniveer

ట్విట్టర్: www.twitter.com/agniveer

అగ్నివీర్ లో సభ్యులవ్వాలనుకుంటే ఇక్కడ సభ్యత్వ నమోదు చేసుకోండి: www.agniveer.com/membership-form

అగ్నివీర్ కి ఆర్థికంగా సాయపడాలనుకుంటే మీ చెల్లింపుల కోసం క్రింది పేజీని చూడండి:

పేమెంట్ పేజ్: www.agniveer.com/pay

పేపాల్: give@agniveer.com

ఇతర అగ్నివీర్ పుస్తకాలను కొనాలంటే మీరు చూడవలసిన పేజి: www.agniveer.com/books

అగ్నివీర్ భారతీయ విపణి : https://india.agniveer.com/

